# శ్రీ బాలచంద్ర ఆప్టేగారి నిర్యాణము

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ప్రముఖ కార్యకర్త శ్రీ బాలచంద్ర ఆప్టేగారు 10-4-84 తేదీన శాశ్వతంగ కనుమూసినారు వారు దక్షిణ భారత హిందీ ప్రచార సభలో వివిధ పదవుల నధిష్ఠించి సమర్థవంతంగా నిర్వహించినారు. హిందీ ప్రచారక విద్యాలయాల్లో ప్రధానాచార్యులుగ ఉండి ఎంతోమంది నవ యువకులను హిందీ శిక్షకులుగ తయారు చేశినారు.

దేశ స్వాతంత్ర్య సంగ్రామంలో చేరి జైలుశిక్షకూడా అనుభవించారు. జైలులో కూడా హిందీ ప్రచారం చేశినారు. వారు గాయకులు, పండితులు, సంగతకులు, రచయితలు. వారు మరాఠీ చందమామకు ప్రాణం పోసి దాన్ని సర్వజనాదర ణీయంగా తీర్చిదిద్దినవారు.

"శాస్త్రి అండ్ ఆప్టే'' ఇంగ్లీషు గ్రామరు విస్తారంగా ప్రజల నాకర్షించింది ఇది ఇంగ్లీషులో రచించిన హిందీ గ్రామరు, ఎందరెందరో దీని ద్వారా జాతీయభాష అయిన హిందీని నేర్చుకొన్నారు.

శ్రీ ఆప్టేగారి నిర్యాణము జాతీయ భాషా ప్రచారానికి తీరనిలోటు. వారిఆత్మకు శాశ్వత శాంతిని ప్రసాదించమని శ్రీ పరమేశ్వరుని ద. భా. హిందీ ప్రచారసభ పక్షాన ప్రార్థిస్తున్నాము

---

# శ్రీ కొత్తపల్లి వెంకటకృష్ణవర్మ నిర్యాణము

ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు తామ్రపత్ర గ్రహీత, హిందీ ప్రచారకుడు, గాంధేయవాది అయిన శ్రీ కొత్తపల్లి వెంకటకృష్ణవర్మగారు తమ 77వ ఏట గుంటూరు జిల్లాతెనాలి బతానగర్ లోని తమ స్వగృహంలో 26 మార్చి 1984న శాశ్వతంగా కన్నుమూసినారు.

హిందీ భాషా ప్రచారకులుగ వారి సేవ అనుపమాన మైనది. ఎన్నో కేంద్రాలలో వారు ఎంతోమంది నవయువకులకు జాతీయ భాష నేర్పినారు. హిందీ విద్యాలయాలు నిర్వహించి హిందీ భాషకు ఎంలేని సేవ చేశినారు.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ హిందీ ప్రచార కార్యక్రమాల్లో శ్రీ వర్మగారు చాల ఉత్సాహంగా పాల్గొనేవారు. వారి మృతిపట్ల ద. భా. హిందీ ప్రచారసభ, ఆంధ్రతమ సంతాపాన్ని తెలియచేస్తూ వారి ఆత్మకు చిరశాన్తిని ప్రసాదించమని దేవుని ప్రార్థించు చున్నది.

---

# శ్రీ గోవిందరాజు గుప్తగారి అస్తమయం

భీమవరం వాస్తవ్యులు, శ్రీ గోవిందరాజు గుప్తగారు తేది 4-4-84 శాశ్వతంగా కన్నుమూసినారు

వారు జాతీయ భాషయైన హిందీ ప్రచారం నిర్విరామంగా చేసినారు. చాలామంది నవ యువకులకు హిందీని బోధించినారు. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని పరమేశ్వరుని ప్రార్థించు చున్నాము




సాహిత్య మాస పత్రిక

# 361

మే, 1984

సంపుటి : 31, సంచిక 2

వార్షిక చందా : పదిహేను రూపాయిలు

విడిప్రతి : రూపాయిన్నర

సంపాదకులు:

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ఈ సంచికలో

## సంపాదకీయము

జయనామ సంవత్సర చైత్రమాసములో ఉగాదినాడు భాగ్యనగరంలో స్రవంతి పుట్టి తెలుగు - కేదారములలో పసిడిపంటలు పండించుచూ ముందుకు ప్రవహించుచున్నది. సాహిత్యవేత్తలు కవులు పండితుల రచనలే ఈ స్రవంతికి జీవనధారలు. ప్రజాహృదయమును రసార్ద్రిమొనరించి మన భాషా-సంస్కృతుల కనువుగ రూపురేఖలు దిద్దుకొనుచూ స్రవంతి అవిచ్ఛిన్నంగ సాగిపోతున్నది. ఆంధ్రావని లోని సహృదయుల ఆదరాభిమానాలను చూరగొనుచూ హిందీ, ఉర్దూ బెంగాలీ, మరాఠీ, కన్నడము మొదలగు భాషాయోషల సాహిత్య సుమనాల సౌరభాలను వెదజల్లుచూ స్రవంతి నిరాటంకముగ పయనించుచున్నది. ఈ స్రవంతి తెలుగు యువకవుల రచయితలకు చేయూత నిచ్చి వారి సృజన శక్తికి అపారమైన దీప్తిని-వ్యాప్తిని కలుగ చేసినది.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి శ్రీ బూర్గుల రామకృష్ణారావు, ప్రముఖ హిందీకవి శ్రీ సుమిత్రానందన్ పంత్ మొదలగు పెద్దలపై విశేష సంచికలను వెలువరించినది. సాహిత్య వ్యాసాలు, భాషాశాస్త్రము, జానపదసాహిత్యము, వ్యాకరణము మొదలగు అనేక విషయముల పైని పరిశోధక వ్యాసాలు స్రవంతిలోని ఆణిముత్యాలు. శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు స్రవంతి ఆవిర్భావానికి మూలపురుషులు. స్రవంతికి వాసంతిక సౌరభ శోభను చేకూర్చి సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దిన వారూ వారే. స్రవంతి ధారల ప్రవాహ శక్తికి వారి సంకల్ప బలమే కారణము.

దక్షిణ భారతహిందీ ప్రచారసభ, జాతీయభాషయగు హిందీ ప్రచారంతోపాటు ప్రాంతీయ భాషయగు తెలుగు భాషాప్రచారానికి ప్రోహదం చేసిన నాడే, జాతీయ భాషావికాసం చెందుతుందనే శ్రీ శర్మగారి దృఢ విశ్వాసమే, ఈ స్రవంతి ముప్పది ఏండ్ల జీవితానికి శ్వాసకోశము.

నాడు భాగ్యనగరంలో తెలుగు భాషావికాసానికి తోడ్పడే ప్రముఖ సంస్థలుండేవి. ఇవి కాక తెలంగాణా రచయితలసంఘములో ఎందరెందరో రససిద్ధ కవులుండేవారు. శ్రీదాశరథి శ్రీనారాయణరెడ్డి శ్రీ కాళోజీ మొదలగు వారందుముఖ్యులు- కన్నడ ఉర్దూ భాషలలో కవిపండితులుకూడా నాటి కవిసమ్మేళనాదులలో పాల్గొంటూ ఉండేవారు. శ్రీశర్మగారు వీరందరి సహకార బలంతో ముందడుగు వేసేవారు. హిందీ తెలుగు, ఉర్దూ, కన్నడ కవులు- పండితులు- వీరు హిందీ పండితులు, వారు కన్నడ పండితులు-అను భేదభావంలేక, అందరితోనూ ఐక్యంగా కల్సిమెల్సి ఉంటూ శ్రీ శర్మగారు ఏకోన్ముఖంగా కృషిచేస్తు ఉండేవారు.

కాలాంతరంలో- శ్రీజయనామ సం॥ చైత్రశుద్ధపాడ్యమి శుభ సమయాన చైతన్య స్రవంతి ప్రథమసంచిక రూపంలో వారి కృషి బిందువులే ప్రవాహగతి నందుకొన్నవి. శ్రీశర్మ గారు శ్రీ దాశరథి గారు స్రవంతికి ప్రథమ సంపాదకులు. తరువాత దాశరథి గారు తప్పుకున్నారు. శ్రీ నారాయణరెడ్డి గారు సంపాదకులుగ నున్నారు. తదాదిగా శ్రీ చిట్టూరిశర్మగారు, శ్రీఅప్పన్నశాస్త్రిగారు శ్రీవేమూరి రాధాకృష్ణమూర్తిగారు శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యం గారు మొదలగు పెద్దలు, ఈ స్రవంతి 'పలుకొండలలో' కోనలలో మలుపులు తిరిగి అందచందాలు చిందించటానికి, పలుతావుల నేలలను", సుజలాం, సుఫలాం "సస్యశ్యామలాం చేయటానికి తోడ్పడినారు. వారి కృషికి పాఠకలోకం సంపూర్ణ సహకారం అందించింది. అందుకే అన్నివిధాల సహకరించే వారందరకే కాక, పాఠక లోకానికి నమస్సుమనాల నందించుచూ, అనతిదూర భవిష్యత్తులో స్రవంతి స్వర్ణ-స్రవంతిగా రూపొందగలదని ఆశించుచున్నాము.

# రక్తాక్షి

—డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

నా గుండెలమీద గురుగోవిందు కర్పాన్ల మొనలు
మెత్తగా చీల్చి ఎర్రటి ముగ్గులు పెడుతున్నాయి.
నాలుగిళ్ళ అవతల నా మిత్రుడు మహమ్మదు కుడిచెయ్యి ఎడమచెయ్యి
కెమికల్ వార్ నృత్యాభినయ ముద్రలు పడుతున్నాయి.
ఊరిచివరి ప్రపంచయుద్ధాల శ్మశాన వాటికలో
అణ్వస్త్రాల భయంకర వటవృక్షం మీద
తెలివిమీరిన రెండు పండు కోతులు సూ
ఒకదానొకటి రక్కుకోవాలని చూస్తున్నాయి.
కొమ్మలమీద కొట్లాటకు చోటుచాలదని
రోదసీ కుహర సువిశాల మైదానంలోకి దూకి
పీకలునొక్కుకోవాలని పోటీ పడుతున్నాయి.
సరిగ్గా సమయానికి వచ్చావు రక్తాక్షీ !
నీ విహారానికి రుధిరోద్గారి దారి ఏర్పరచి వుంచింది.
రక్తబీజుని ప్రియ పుత్రికా!
నీ రక్తసిక్త నేత్రాలలో అనురక్తిని నింపి
మా మానవాళి యెడ 'అనురక్తాక్షి'వికా!
నాకుతెలుసు నా నివేదన !
తోడేలుముందు గొర్రెపిల్ల ప్రార్థనని.
గొర్రెల మందను చూస్తూ నోరూరుతున్న రక్తాక్షి అంకాళమ్మ అమ్మణ్ణి
తినబోతూ రుచి అడుగుతోంది సైంటిస్టు పోతరాజు తమ్ముణ్ణి!

. తెలుగు రీడర్
బెంగుళూరు విశ్వవిద్యాలయం,
బెంగళూరు-560 056.

# ఆత్మ భక్షణ

—చెన్నోజు రామ్మోహన్

లక్షలాది కోట్లాది దీన జనులను మంత్ర ముగ్ధులను చేసి
వెలుగు బాట వెంట నడిపించే ఉక్కు గుండెల
నాయకసింహ కిశోరాలను పట్టి-బంధించి-తెచ్చి
శ్వాస ఆడని దట్టమైన అరణ్యాల్లో చెట్ల పీపులకు కట్టి
గుండె గూళ్లు గురిచూసి గుళ్ల అగ్ని వర్షం కురిపించి
పదునైన చుర కత్తులూ దింపి కసిగా చేసిన వధయే
——ఈ రక్తం ఓడుతున్న వైష్ణవ్య సంధ్య !

పడమటి అజ్ఞాన చీకట్ల శవాలను తింటున్న
తూర్పు విజ్ఞానపు వెలుగుల చితి మంటలు——
మనిషి తాలూకు పాపకర్మల ఉషస్సులను
వెనుక నుంచి తరుముకొస్తున్న పునర్జన్మల తమస్సులు——
తృష్ణల ఆత్మను ఆనందాబ్ధిలో ఓలలాడించి
శూన్యంలో తిరిగే గోళాలను సైతం పేదవాడి కన్నీటిలా
కరిగించి
పరమవైరాగ్య రోదసిగా మార్చివేసే శ్రావ్యసంగీత విభావరిలా
వినూత్న స్వర్గాలను వెతికే ఐరోపా సమాజాల తాలూకు
బంగారు సాయంత్రాల పొత్తిళ్లలో నిక్షిప్తమైన
క్రొత్త క్రొత్త అనుభవాల సుతి మెత్తని రాత్రులే
——ఈ గులాబీ రంగు ముద్ద పెదవుల సంధ్య !

జీవన దుఃఖాల నదులు మనోవ్యాకుల సముద్రం వైపుగా
పరుగెత్తినట్లు
అవమానాల బాధలూ అద్వైత భావాలూ కలబడినట్లు
క్షణంలో సగం బలహీనతకు లోనైన మహా మేధావి
ఈ నర జీవితం ఏమిటని ప్రశ్నించుకుని-తన్ను తాను తిట్టుకుని

కోడిగ్రుడ్డంత బురదని ప్రీతిగా ముఖానికి రాసుకున్నట్లు
—ఈ అందాల ఆకాశంలో భిన్నవర్ణాల తిక్కరేగిన సంధ్య'
కఠినతమమైన శిలల ఎనలు-అనురక్తి ఎఱుగని రాతి బండలు
లీలగా వినిపించే సున్నితమైన సృష్టి సంగీతం విని, అనుభవించి,
కఱిగి
పిల్లరాళ్ళై ఇసుక రేణువులై ధూళి గుళికలై జీవాత్మలై
జరామరణాల జగతి ఆట ఆడుతున్నాయి--
—దేహాలలోంచి బలవంతంగా వెళ్ళగొట్టబడిన ఆత్మలు
కోట్ల రెట్ల సాహస సామర్థ్యాలతో దివ్యమై భవ్యమై
జ్యోతిర్మండలాలై ఈ భువనభాండం ముట్టడింపుకై
కలసికట్టుగా కదలివస్తున్న సందళ్ళు-అలజళ్లు-అలికిళ్ళు-

టీచర్,
శ్రీ రామకృష్ణ విద్యాలయం,
మహబూబాబాదు-507101

# నవకవిత

-- -సుపాణి

సమకాలీన సమాజ దృశ్యాన్ని
సజీవంగా సమాయత్తం చేసి
గింజుకుంటున్న పద జాలాన్ని
గిడసబారకుండా చూసి
పొంగి పోతున్న భావోద్వేగాన్ని
పుడమి పాలు కాకుండా కాపాడి
రసాత్మకమైన వాక్యాలతో దాన్ని
రమణీయార్థ ప్రతిపాదకం చేసి
ప్రసవ వేదనా నంతరం దాన్ని
ప్రశమింప జేస్తే... అది
నవతా శిఖరాల నధిరోహించే
నవకవిత విరాజిల్లుతుంది

# అసుర సంధ్యలో

ఉర్దూమూలం : 'మఖ్మూర్' సయీదీ
అనుసృజనం : డా॥ సి. నారాయణరెడ్డి

అసురసంధ్యలో సూర్యహత్యతో అరుణకాంతి వ్యాపించింది
నల్లనల్ల తెర- కురిసే యెర్రటి జల్లు, వెనక వ్యాపించింది.
నిండివుంది పొగ రైలులోన పయనించే పథికుని గుండెల్లో
పట్టాలకు ఇరుపక్కల చిక్కని పచ్చదనం వ్యాపించింది.
ముంగిట ముంగిట పూలై పూస్తూ రంగులకాలం వచ్చింది
దారిదారిలో పరిమళమై మత్తైన ఋతువు వ్యాపించింది.
ఎండిన మండిన గుండెయేటిలో ఎగిసే స్మృతుల తరంగాలు
నయన మౌనతీరాలలోన స్వప్నాల పసిమి వ్యాపించింది.
వెలుతురు లంటే జడిసే మనసులు కలిశాయి గుడ్డిఊహాల్లో
మెరిసే నగరిని తలపు మంచుపొగ మేలిముసుగు వ్యాపించింది.
మంచు రెప్పల సమాధులపై జ్వలియించె బాష్పదీపాలెన్నో
వేదనా నిశీథాలలోన ఒక వింతవెలుగు వ్యాపించింది.
వర్షిస్తాయనుకున్నావేమొ ! జవాబుల పూవులు నీ ఒడిలో.
ఎందుకు మూసిన కిటికీపై ఉరిమే నేత్రం వ్యాపించింది,
ఇంత ఇంత సంపన్న జగతిలో ఏమున్నది ఏమున్నదనీ?
చూపుకోసలు పయనించే మేరకు శూన్యాకృతి వ్యాపించింది.
మొక్కమొక్కలో ఎవరి ప్రార్థనలు మోసుకెళ్తైనో ఓ '      ర్ !'
ఆకురాలు కాలంలో ఇంతటి హరితశక్తి వ్యాపించింది,

# స్వప్నంలో సత్యం

పోతుకూచి సాంబశివరావు

ఈ సృష్టిలో ఒక స్వప్నం
భూగోళం
భూమి మీద మనిషి
ఆ స్వప్నంలో ఒక అల
అల్లంత దూరంలో ఆకాశం
అవనిని చుంబిస్తోంది.
ఈ ఆకాశ గోపుర పంజరంలో
మనుషులు ఎగిరి ఎగిరి మిడిసి
పడుతున్నారు.
కలం నుంచి రాలిన సిరాచుక్క
కాగితం మీద చెరగని ఉక్కు ముక్క.
ఆ వత్తిడికి మానవ మేధస్సు
అణిగి మణిగి కుంచించుకు పోతుంది.
ఆలోచన కపోతాలు ఎంతదూరం
ఎగుర గలవు?
మూడుసార్లు ప్రదక్షిణలో
ముల్లోకాలు ఎలా చుట్టగలవు?
నింగి, నేల ప్రణయానికి
ఇంద్రధనుస్సు రాగాల వారధి
మానవ మేధస్సు విశ్వాంతరాళం
మధ్య వారధి మహోన్నత ధ్యానం
సత్యం ఏదైనా, మనిషి నేడు
ఒక విద్యుత్తు తరంగం
ముట్టుకుంటే చాలు

మొదలునుంచి తుదివరకు ప్రకంపనమే
అంగుళం నేల మీద
అనంతంగా పీఠాలు వేసుకొని
అనవరతం ఆధిక్యతకై
ఆర్రులు చాస్తున్నాడు మనిషి
నాలుకను పాముమెలికల్లా త్రిప్పి
చీలిన నాలుకతో విషం గ్రక్కి
మంద స్మితాల పొరల నుంచి రాలిన
హృదయ మందారాలను
మాడ్చేస్తున్నాడు మనిషి.
అణువణువున భయం భయం
అనవరతం ధనం దాహం
గాలిమారినా ధూళి రేగినా
ఆలి జారినా శిరంవంచి
చిగురిస్తున్నాడు మనిషి.
సంఘంఘోష సముద్రపు హోరుగా మారినా
కర్ణపుటాలలో కఠినత్వపు దూదినింపి
కదలిపోతున్నాడు మనిషి,
మంచితనం శవపేటిక చేసి
మట్టిలో పాతేస్తున్నాడు
నీతుల శరపరంపరలు ప్రజలపై వదులుతూ
అవినీతి కవచంతో హాయిగా
బ్రతుకు తున్నాడు మనిషి.

మనిషి నరనరంలో క్షీతియే
రక్తం హరించి గడ్డకట్టి నిలుస్తుంది
ఈభూగోళం గందర గోళం
కాలుష్యం విషవాయువులు
విశ్వమంతా వ్యాపిస్తున్నాయి—
మనిషీ ! నిన్ను సంహరించే
శత్రువు నీలో ఉండి
నీకు తెలియకుండానే నీ చుట్టూ వుంది
భయద జీమూత ఘెళ ఘెళార్భటుల
పర్జన్యం గర్జిస్తోంది
గోడలమధ్య కాంతి రేఖలు చిమ్ముతూ
నీసమాధి వెలుగుతోంది
గుండెల్లో జాలి కంఠాల
ప్రతిధ్వనుల రొదల హోరు
నీమేధస్సును స్తబ్దత సిమెంటు రాయిగా
మారొస్తోంది
నిలువెల్లా నీ విషం చూసి
పక్షులు ఎగిరి పోతున్నాయి.
జంతువులు పారిపోతున్నాయి
కానీ కాలం ఆశతో మార్పుబాట
పయనిస్తోంది.

సముద్రంలో కదులు తున్న
ప్రతి బిందువు
మంచినీటి సరస్సు లౌతాయి
విషాద గీతాల జారే కన్నీరు
పన్నీరు జలపాతా లౌతాయి
రక్తం అగ్ని పర్వతాల భుగ భుగల్లోంచి
చందనార్ద్రి చంద్రికలు ఉదయిస్తాయి.
భరింపరాని వాసనల బురదనేల మారి
పరిమళాల సుమాలనందనవనమౌతుంది
మదోన్మత్త భ్రష్ట అపహాస్యపు
దంష్ట్రిల నుంచి
మందహాసాల మాధుర్యం చిలుకుతుంది
అసహ్యం రూపం అనంతం నుంచి
అపురూపసౌందర్యలహరి జనిస్తుంది
ఓ పిలుపులోని రాగం
అనంత వాయువులలో లీనమై
నవ జీవన నవ్య దివ్య భావమై
అఖండ చంద్రికల జ్యోతి రూపమై
కాలం గమనాన్ని
కల్పవృక్ష గమ్యం వైపు
కదిలిస్తుంది, కరిగిస్తుంది, కాంతినిస్తుంది.

## బతుకుగానం

—విద్వాన్ దస్తగిరి

ప్రకృతి
నేపథ్య సంగీతం సమకూరిస్తే

మానవుడనే కంఠంతో పాడుతుంది
నవరసాల బతుకుగానం.

# ఉగాది స్మేరాసనము

—డా॥ మాధవరావు రేగులపాటి

ఇన్నాళ్ళుగా చూస్తున్నా
స్మేరాసనము జరుగుతుందని
ఉగాదినాడైనా జనం మనతో
దిగులు వీడి బ్రతుకుతుందని
రోమన్‌లో "గ్రీన్ ట్విగ్స్"తో బ్రతుకుతున్న ఉగాది
ఆఫ్రీకాజుల్ జాతిలో అబోతులతో
నృత్యగీతాలతో ఆనందంగా వెలుగుతున్న ఉగాది
స్కాటిష్ సైబీరియన్, రష్యన్‌యొక్క
"ఈవిల్ స్పిరిట్స్"ను పారద్రోలుతున్న ఉగాది
ఇంగ్లాండులో "నాటర్‌డాం"లు మ్రోగిస్తున్న ఉగాది
నాజీవితపు చీకటి బజార్లో
చెల్లనేరని నోట్లు హజార్లు.
నాబ్రతుకువాడలో వెలసినలైట్లు
కరెంటులేక మూల్గుతున్నవి చీకట్లు
అవే కళ్ళతో చూస్తున్నాను తెల్లదనం రాలేదని
హండ్రెడు వాట్సుబల్బు అందరికి ఒక రీతిగా అందించును వెలుగు
అక్కడే కూర్చునికనులు మూస్తున్నప్పుడు ఏమితెలుసుదానిరంగు
జీవితం కరుగుతున్న తేనెపట్టు
దాంట్లోనే పదుగురికి పంచుపెట్లు !

---

1) గ్రీన్ టిగ్స్ — రోమనులు ఉగాదినాడు ఆకుపచ్చని ఆకులు ఒకరి కొకరు పంచుకుంటారు.

2) ఈవిల్ స్పిరిట్స్ — స్కాట్లాండు మొదలైన దేశాల్లో ఈవిల్ స్పిరిట్స్ పోవడానికి మంటలు వేస్తారు.

3) నాటర్‌డాంలు — ఒక విధమైన గంటలు.

మలుపుదారుల్లో అడుసు పేరినది.
మల్లెపూలల్లో పల్లేరులు రాలినవి.
స్వచ్ఛంద విహాయస విహంగ పక్షంలో
నవోష్ణ కవోష్ణమయ రాక్షసం వెలసింది.
అంబర వీధుల వెంట
అశాశ్వత సత్యం కొరకు వెదకుతున్న
నిజంకొరకు పోరాడను నైజంవీడి
నిజాములు లేనప్పుడు,
శ్వేతాంబరాలక్రింద స్వార్థఘటవాయిద్యం వింటున్నప్పుడు.
రుధిరోద్గారిని రక్తాక్షిగా మారుస్తున్న
రక్తాక్షిని పుండరీకాక్షిగా మారుస్తున్న
ఆ తరువాత-
అయినా
తరువాత
నవరుచితో
మామిడి నీడలో పెండ్లి సందడి చేయిస్తున్న
నా భావాలను భాషాంతరీకరించి
భాషలో ప్రాణం పోయించే
రక్తాక్షిచుట్టు కాంతిరేఖను రచిస్తున్న
క్రాంతిరేఖకు సమాంతరంగ లక్ష్మణరేఖను గీయిస్తున్న
కృతక వైరుధ్యములుతెగి విశ్వాంకముపై
నవశుభాసారమై విరియు మంగళాంకము.
అంతదాక ఆరాటపడుతున్న
అంతవరకు అలమటిస్తున్న
ఈనాడు చూస్తున్న
స్మేరాననము జరిగిందని
ఉగాదినాడు మనం జనంతో
దిగులువీడి బ్రతుకుతున్నామని

# అబ్సర్డ్ నాటకాలు--2

—శ్రీ వేమూరి ఆంజనేయశర్మ

అబ్సర్డ్ శబ్దానికి పరిభాషను తెలియజేస్తూ కామూ ఇంకొక వివరమిచ్చాడు. గ్లాసు వెనక నిలబడి ఎవడో ఒకడు ఫోనులో మాట్లాడుతున్నాడనుకోండి. అతని మాటలు మనకు వినబడకపోయినా అతని హావభావాలన్నింటినీ మనం చూడగలము. ఆ చూస్తున్నప్పుడు మనుష్యుడు మనకు కనబడుతుంటాడు కాని అతడు ఏపని చేస్తున్నాడో (ఫోనులో మాట్లాడడం) అది మనకు వినబడదు. ఇది ఒకరకపు అబ్సర్డ్ స్థితి. ఇటువంటివి ఎన్నో ఉదాహరణలివ్వవచ్చును. ఆ ఉదాహరణలన్నీ అబ్సర్డ్ నాటకాలకు కావ్యవస్తువులు. నిట్షే ఒక దార్శనికుడు. అతనిపాత్ర జరాథుష్ట ప్రవచనం చేయడానికి కొండల మీదనుండి కిందికి దిగుతుంటాడు. దోవలో అతనికొక ముసలి యోగి కన్పిస్తాడు మాటల సందర్భంలో ఆయోగి జరాథుష్టను ప్రవచనానికి వెళ్ళవద్దని బోధిస్తాడు. నీవు అడవిలో ఒంటరిగా ఒక్కడవే ఎట్లా వుంటున్నావని ప్రశ్నిస్తే యోగి నేను పాటలువ్రాస్తాను. పాడతాను. పాటలు వ్రాసేటప్పుడు నవ్వుతాను, ఏడుస్తాను. ఆరూపంలో ఈశ్వరస్తుతి చేస్తాను అని జవాబిచ్చాడు. అయినా జరాథుష్ట ముందుకు సాగాడు. కాని అతని మనస్సులో పరిపరి విధాల ఆలోచనలు బయలుదేరినవి. ఈశ్వరుడు మరణించిన విషయం ఇతనికి తెలియలేదా? ఆమాట ఇతడు వినలేదా? అని ఆలోచించాడు. అంటే నిట్షే ఏమివ్రాసినా అప్పటికి ప్రజలజీవితంమీద మతసంబంధమైన ముద్ర చెరగలేదని అర్థమవుతుంది. ఈశ్వరుని అస్తిత్వానికి సంబంధించి చిరకాలంగా వాదోపవాదాలు జరుగుతూనేవున్నవి. కాని మొదటి ప్రపంచయుద్ధం మానవుని భావాలమార్పుకు బాగా తోడ్పడింది. జీవితంలోని అసంగతులు 'కొట్టవచ్చినట్లు అర్థమయ్యేపరిస్థితి ఏర్పడింది. సాహిత్యరచయితలు జీవితంలోని అసంబద్ధతను బాగా అర్థంజేసుకొని సాహిత్యశైలిలో, వివిధరూపాలలో దానిని అభివ్యక్తం చేయడ మారంభించారు. దానితో అనేక సాహిత్యవాదాలు బయలుదేరాయి. అభివ్యంజనావాదం, దాదావాదం, సర్రియలిజంవంటివి ఆ వాదాలు. అనేక రచనలు ఆయావాదాల కనుగుణంగా వెలువడ్డవి. అదేవిధంగా రెండోప్రపంచయుద్ధం పూర్తిఅయిన తరువాత ది థియేటర్ ఆఫ్ అబ్సర్డ్ వ్యాప్తిలోకి వచ్చింది.

ఈ విశేషనాటకరూపాన్ని అనుసరించిన బెకెట్, అయనెస్కో, అల్బీ, పింటర్, జెనే మొదలైనవారు శైలీగతమైన ప్రత్యేకతవల్ల ఒకడేరాకిందకు చేరినట్లయింది. జీవితంలోని అపరిహార్యమైన విసంగతులనూ, నిరర్థకతనూ, మనుష్యుని అసహాయ స్థితినీ ఈ నాటకాలు వ్యక్తం చేయడమారంభించాయి. సార్త్ర్, కామూలుగూడా తమ నాటకాలలో విసంగతులను చిత్రించారు. కాని వారి నాటకాలలో శైలి, కథాగమనం భాషా వంటివి క్రమబద్ధంగా, తర్కబద్ధంగా మనకు కన్పిస్తున్నవి. పాత్రలవైవిధ్యం, గతీ వంటివిగూడా వారి నాటకాలలో వుండడం మనం గమనించగలము, కాని అబ్సర్డ్‌నాటకాలు అందుకు భిన్నమైనశైలిని అవలంబించాయి. నాటకంలో అసంబద్ధతను వివరించడానికి, అబ్సర్డ్‌ను చిత్రించడానికి వారు అసంబద్ధమైన, అసంగతంగా కన్పించేశైలిని, టెక్నిక్‌ను

అవలంబించారు. వారి కథ, వారి దృశ్యాయి, వారి భాష, వారి సంభాషణాశైలి అంతా అసంబద్ధంగానూ, అసంగతంగానూ వుంటుంది. స్టేజిమీద వారు చూపిస్తున్నదంతా అసంబద్ధంగానే ప్రేక్షకుడికి కన్పిస్తుంటుంది. అసంగత విషయాలను సంగతమైన భాషలో, శైలిలో చూపించడం సంభవంగాదని వారి అభిప్రాయం. వారి దృశ్యాలలో, భాషలో, సంభాషణలలో పరస్పర సంబంధంగానీ ఏకవాక్యతగానీ, అర్థస్ఫురణరూపంగానీ, క్రమబద్ధమైన వికాసంగానీ ఏమీవుండవు. సామాన్య దర్శకుడికి అంతా అయోమయంగా వుంటుంది. 1945 నుంచి 1965 వరకు ఈ నాటకాలు ప్రముఖస్థానాన్ని వహించాయి. ఈ నాటకకారులు నిర్మించిన టెక్నిక్ ప్రస్తుతం ఆరూపంలో కాకపోయినా ఆధునిక నాటకాలను ప్రభావవంతం చేసినదంటే అతిశయోక్తిలేదు. ఈనాటకాలప్రత్యేకత ఏమిటంటే పరంపరాగతమైన విశ్వాసాల యెడల అనాస్థా, మనుష్యుణ్ణి అసలురూపంలో నగ్నరూపంలో చిత్రించడం అనవచ్చును. నాగరికత ముసుగులో వున్న మానవునిస్వరూపం వేరు. అది నిజమైన స్వరూపంగాదు. ఆముసుగులేని మానవచిత్రణ ఈ నాటకాలముఖ్యోద్దేశ్యం. అంటే మానవుని అసలురూపాన్ని, ఆదిమస్వరూపాన్ని ఈ నాటకాలు చిత్రిస్తుంటవి. ఉదాహరణకు బెకెట్ వ్రాసిన వైటింగు ఫర్ గోదోను చూడండి. కొద్దిగా వయస్సుమళ్ళిన ఇద్దరువ్యక్తులు గోదో రాకకొరకై నిరీక్షిస్తూ కూర్చొనివుంటారు. వారు ఎంతకాలంగానో అలా నిరీక్షిస్తున్నారు మాట్లాడడానికి గానీ, చేయడానికిగానీ, వారిదగ్గర ఏమీలేదు. అయినా ఏదోవిధంగా సమయం గడపాలి. అందుకు వారు ఏవో మాటల్ని, భాషను ఉపయోగిస్తున్నారు. సామాజిక సంబంధాన్ని కల్పించేదీ, భావవ్యక్తీకరణకు ఉపయోగించేదీ భాష వారివిషయంలో అటువంటిదేమీలేదు. కాలంగడపాలి. అందుకు భాషను ఉపయోగించాలి. అంతే వారిపని కొంతసేపైనతరువాత పోజో అనేవాడు తనఅనుచరుడు లక్కీతో రంగంమీద ప్రవేశిస్తాడు లక్కీ మెడలో తాడుంటుంది. ఆ తాడును పోజో పట్టుకొని వుంటాడు. రెండోరోజు వాళ్ళిద్దరూ తిరిగి రంగంమీదకు వస్తారు. ఈ సారి పోజో అంధుడు. లక్కీ అతడికి మార్గం చూపిస్తుంటాడు. కొద్దిసేపు ఏదోమాట్లాడుతారు. వెళ్ళిపోతారు. మొదటి ఇద్దరూ అట్లాగేకూర్చొని వుంటారు. గోదో వస్తాడోరాడో తెలియదు అనంత నిరీక్షణ. ఏదో లభించనిదానికొరకై ప్రాప్తంగాని, దాని కొరకై నిరీక్షణ జరుగుతున్నది. అదే ఆశకు ప్రతీక. ఈ నాటకంలో ఏ ఘటనా జరగదు. నాటకంలో గతిలేదు. తెరఎత్తినప్పుడున్న స్థితే తెరదించినప్పుడు గూడా వుంటుంది. తెరఎత్తి తెరదించడానికి మధ్యగల కాలాన్ని నిరర్థక శబ్దాలతో, నిరర్థకమైన ఆంగిక క్రియలతో గడపడం జరుగుతుంది. గతిలేని, నిస్తబ్ధమైన విచిత్రస్థితిని నాటకకారుడు సృష్టించాడు. స్టేజిమీదనుండి ఎవ్వడూ పోడు. స్టేజిమీదికి ఎవ్వడూ రాడు. అప్పుడప్పుడు ఒకడెవరోవచ్చి గోదో ఆప్పుడే రాడు అని చెప్పిపోతుంటాడు. అయినా మనవాళ్లిద్దరూ కూర్చొనేవుంటారు. నిరీక్షిస్తూనేవుంటారు. మొదటి అంకం చివర.

ఎస్ట్రిగన్ — మంచిది, పోదాం

బ్లాడీమీర్ — పద, పోదాం అంటారు

రెండో అంకం చివరా ఇవేమాటలు. కలిసివుండడం వలన ఆ ఇద్దరూ ఒకరంటే ఇంకొకరు విసిగివుంటారు. అన్నమాటలే అంటుంటారు.

గోదోకొరకై నిరీక్షిస్తూనే వుంటారు. ఇక్కడ నాటకకారునిలక్ష్యం గోదోకాదు. నిరీక్షణ. ఈ నిరీక్షణే జీవితం. నిరీక్షణలో కాలాన్ని గడపడమే సమస్య. దీనినిబట్టి అబ్సర్డ్‌నాటకాలు చిత్రించే చిత్రణను అర్థం జేసుకొనవచ్చును. ఇబ్సన్‌వంటి నాటకకారులు సమస్యల్ని చిత్రించారు. కాని వీరు ఆ సమస్యలను జీవితంలో ఎదుర్కొంటున్న మానవుని నిస్సహాయతను చిత్రిస్తున్నారు. బాహ్య యథార్థంకంటే ఆంతరంగిక వాస్తవికతను చిత్రించడమే వీరి ప్రధానలక్ష్యం.

సొఫోక్లిస్‌నుండి ఇబ్సన్‌వరకూ రచించిన నాటకాలలో విశేషవ్యక్తిత్వం గల నాయికా నాయకులుండడం, కథకు ఆది, మధ్యాంతాలుండడం. మనమెరుగుదము. అభివ్యంజనావాదపునాటకాలలో ఆ నియమాలు నిరాకరించబడ్డవి. సుసంగతితమైన కథ, జీవితంమీద రుద్దబడుతుందేగాని అనుభవించబడదని వారిఅభిప్రాయం. స్ట్రిండ్‌బర్గ్ తన అభివ్యంజనా వాదనాటకాలు టు డెమోస్కస్, డ్రీమ్ ప్లేలలో స్వప్నాలను, దుస్వప్నాలను, మనోగ్రంథుల (obessions)ను ఆధారంచేసుకొని అంతర్మనో సంచనాలను వ్యక్తం చేశాడు. డ్రీమ్‌ప్లేనాటకం పీఠికలో స్ట్రిండ్‌బర్గ్ ఈ నాటకంలో గూడా స్వప్నదృశ్యాలను చిత్రించడం జరిగిందనీ, ఆ దృశ్యాలు హేతుబద్ధంగా వున్నట్లు కన్పించినా వాస్తవానికి అసంబద్ధాలేననీ కాలానికీ ఆకాశానికీ అస్తిత్వముండదనీ అన్నాడు. అబ్సర్డ్‌నాటకకారులు స్ట్రిండ్‌బర్గ్‌కంటే రెండడుగులుముందుకు సాగారు. కాఫ్కానవల ట్రయల్‌ను నాటకంగా చిత్రించి ప్రదర్శించడంతో అబ్సర్డ్‌నాటకప్రదర్శనకు నాంది జరిగిందని మనవి చేసి వున్నాము. అంతకుపూర్వమే సర్రియలిస్టురచయిత అపోల్నియర్ టాయరేసియా అనే సర్రియలిస్టునాటకం రచించాడు. తరువాత దాదావాదులు ఆస్కార్ కోకోష్కా వ్రాసిన స్పింక్స్ అండ్ స్ట్రోమన్‌నాటకాన్ని ప్రదర్శించారు. ఆ ప్రదర్శనలో పెద్దపెద్దమాస్కులను ఉపయోగించారు. వాటికళ్లల్లో చిన్న చిన్న బల్బులు అమర్చి అంధకార బంధురంగా వున్న స్టేజీమీద భయానకవాతావరణాన్ని సృష్టించారు దాదావాది ట్రిస్టన్‌జారా (Zara)తనడైరీలో ఆ నాటక ప్రదర్శనతో కొత్తకార్యక్రమం ప్రారంభమయిందనీ, ప్రేక్షకుల కళ్లముందే డైరక్షను జరిగే కొత్తపద్ధతి అమలులోకి వచ్చిందనీ, వ్రాసుకొన్నాడు. తరువాత అతడు కొన్ని ప్రదర్శనాలు ఏర్పాటుచేశాడు. అతని నాటకాలలో నిరర్థకమైన కవితాఖండికలుండేవి. వాటికి నాటకంతో ఏమీ సంబంధముండేదిగాదు. జారారచించిన ది గ్యాస్ హార్ట్‌లో శరీరంతాలూకు వివిధఅంగాలు పాత్రలుగా ప్రవేశపెట్టబడినవి. దాదానాటకాల తరువాత సర్రియలిస్టునాటకాలు, ఆ తరువాత అబ్సర్డ్‌నాటకాలు వచ్చాయి.

అనుకరిండం మానవసహజం. భాషసహాయం లేకుండా గూడా అనేక క్రియలను చూపించి భావప్రకటన చేయవచ్చును. సర్కసులు, పగటివేషాలు వంటి క్రియలు ఎన్నో అందుకు ఉదాహరణలు. అబ్సర్డ్ నాటకాలలో అటువంటివి చాలా ప్రవేశపెట్టబడ్డవి. భాషను తక్కువకు తక్కువగా ఉపయోగించడం వాటి ప్రత్యేకత. శబ్దాలకున్న అర్థాలను మార్చి వాడడం ఇంకొక ప్రత్యేకత. ప్రేక్షకులు, నటులు, పాత్రలలో సాధారణీకరణంగూడా వుండదు. అది సంభవంకాదని వారి అభిప్రాయం. అబ్సర్డ్‌నాటకాలలో క్రమ వికాసం పొందిన కథకు స్థానమేలేదు. గనుక ముందు ఏమి జరుగుతుందోననే ఉత్కంఠ ప్రేక్షకులలో వుండదు. ముందు ఎమైనా జరుగవచ్చు. ఏదో జరుగుతుంది. దానిని అనుభవించడమే, చూడడమే ప్రేక్షకుల వంతు అనివారిసిద్ధాంతం. ఏ సమస్యకూ ఈ నాటకాలలో సమాధానముండదు. పాత్రపోషణ, చరిత్రచిత్రణ ఇటువంటివేమీవుండే ప్రశ్నేలేదు.

రెండోప్రపంచయుద్ధం పూర్తి అయినతరువాత అబ్సర్డ్‌నాటకప్రదర్శన విరివిగా ప్రారంభమయింది. జెనే నాటకం ది మేడ్స్ 1947లో, అయనెస్కో నాటకం బార్డ్ ప్రయమా డోనా 1950లో బెకెట్‌నాటకం వైటింగ్ ఫర్ గోడో1952లో పారిస్ నగరంలో ప్రదర్శింపబడ్డవి. ఈ నాటకాలన్నీ ఫ్రెంచి భాషలోనే వెలువడ్డది. తరువాత ఇతరభాషలోనికి అనువదించబడ్డవి.

కరుణ, హాస్యము, ఆనందము. వేదన ఇవన్నీ జీవిత లక్షణాలు. ఒకేదానికి సంబంధించిన బొరుసు బొమ్మలు. మానవుని ఆంతరంగిక మనఃస్థితుల చిత్రణకూ, అతని సంవేదనాశీలమైన సంచేతనకూ

సంబంధించిన కావ్యబింబాలను, అబ్సర్డ్‌నాటకాలు చిత్రిస్తాయి. అమేడీ నాటకంలో దినదినం పెరుగుతున్న శవం నాటకాన్నంతా ప్రభావితం చేస్తుంది. నాటక పాత్రలైన ఇంటియజమాని, అతని భార్యల మీదేగాక ప్రేక్షకులందరిమీదా అదృశ్యం మృత్యుచ్ఛాయను తాండవింపజేస్తుంది. రాయినాసిరోస్ నాటకంలో విరోధాభాసలచిత్రణద్వారా ఫాసిజం తాలూకు భయంకరస్వరూపం కన్నులకు గట్టేటట్లు చేయడం జరిగింది. ఆ నాటకాలు ప్రేక్షకులలో ఒక విచిత్రమైన మనఃస్థితిని కలగజేస్తుంటవి. మానవజీవితంలోని నిస్సారతత్వాన్ని నిరర్థకరూపాన్ని ప్రతినాటకమూ అభివ్యక్తం చేస్తుంటుంది. ది బర్త్‌డే పార్టీఅనే నాటకంలో భార్యాభర్తల సంభాషణద్వారా వారిద్దరి మనస్తత్వాన్ని వ్యక్తీకరించడం జరిగింది. భార్యాభర్తలిద్దరూ ఒక ఇంట్లోనేవున్నారు. సంసారంచేస్తున్నారు. కాని అంతరంగికంగా వారిద్దరూ ఒకరికొకరు ఎంతో దూరంలో వున్నారు. వారి మనస్సులలో కలయిక లేదు. ఆప్యాయతలేదు ఆత్మీయత లేదు. కాని సంభాషణ జరుగుతూనే వుంటుంది.

భార్యమేగ్‌- ఈరోజు నీవుచాలా శ్రమపడ్డట్లున్నావు.
భర్త- నేను పాతకుర్చీలన్నీ ఒకచోటికి చేర్చాను, ఇల్లుశుభ్రం చేశాను.
భార్య - బయట వాతావరణంబాగున్నదా ?
భర్త - చాలా బాగున్నది.
భార్య - (కొంచెంసేపు ఆగి) స్టాన్లీ లేచాడా ?
భర్త - తెలియదు. లేచాడా ?
భార్య - అంటే ఇంకా లేవలేదన్నమాట
భర్త - నువ్వు వాణ్ణి కింద చూడలేదా ?
భార్య - నేనిప్పుడే లోపలికి వచ్చాను.
భర్త - వాడు ఇంకా నిద్రపోతూవుంటాడు.
భార్య - (గది నలువైపులాజూస్తుంది. లేచినిలబడి ఉన్నివుండలూ, సూదీ తీసుకొచ్చి కుర్చీమీద కూర్చుంటుంది.) ఈరోజు ఎన్నిగంటలకు షికారుకు వెళ్లావు ?
భర్త - రోజూ వెళ్ళేసమయానికే
భార్య - అప్పటికింకా బాగా చీకటిగావున్నదా ?
భర్త - లేదు. ఎండవచ్చింది.
భార్య - నీవు షికారుకు వెళ్ళేటప్పుడు అప్పుడప్పుడు చీకటిగా వుంటుంది.
భర్త - అవును చలికాలంలో
భార్య - చలికాలంలోనా ?
భర్త - చలికాలంలో ఎండ కొంత ఆలస్యంగా వస్తుంది.
భార్య - ఇప్పుడు ?

ఈ సంభాషణ జరుగుతూనే వుంటుంది. ఇటువంటి మాటలు తరచు మనం వింటూనేవుంటాం కాని సందర్భాన్నిబట్టి అవి ఆ దంపతుల మనఃస్థితిని అద్భుతంగా చిత్రిస్తున్నవి.

అభివ్యంజనావాదులు, దాదావాదులు, సర్రియలిస్టులు అతిరంజితమైన అంగికక్రియలద్వారా ఏ విధంగా మానవ మనఃస్థితులను వ్యక్తంచేయడానికి ప్రయత్నం చేశారో అదేవిధంగా అబ్సర్డ్ నాటకకారులు గూడా ప్రయత్నం చేశారు. అబ్సర్డ్‌నాటకాలను కామిడీలు, ట్రాజిడీలు అని వేరుచేయడంగూడా సంభవంకాదు.

అబ్సర్డ్ నాటకాల పాత్రలు తరచు గూండాలో, సమాజబహిష్కృతులో, ఉపేక్షాపాత్రులో అయి వుంటారు. లేకపోతే పరమదరిద్రులూ, ఇల్లూవాకిలీలేని అవారాపద్ధతిలో వుంటారు. ప్రతి అబ్సర్డ్‌నాటకం ఒక కావ్యబింబమయి వుంటుంది. ప్రతీకలు ఎక్కువ ఉపయోగించబడతాయి. తద్వారా అసంగతుల వ్యక్తీకరణం జరుగుతుంది.

మొత్తంమీద సారాంశమేమంటే ఈ నాటకకారులు కొత్తశైలి, కొత్తటెక్నిక్‌ను అనుసరించి మానవ జీవితంలోని మూల్యరాహిత్యాన్నీ కరుణాజనకమైన స్థితినీ, మానవుని నిస్సహాయస్థితినీ వ్యక్తంచేస్తున్నారు. ఇది ఒక ప్రత్యేకశైలి. ప్రత్యేకమైన టెక్నిక్.

# నవల్లో ఇతివృత్తం

—మాదిరాజు రంగారావు

ఇతివృత్తం మానసికమైన స్తంభనం (టెన్షన్) మరియు సంఘర్షణలతో నిండిన పరస్పర సంబంధం గల సంఘటనల పరంపర. అది ప్రధానపాత్ర తన కష్టాలనుండి బయటపడే అన్వేషణలో అనుసరించే మార్గంగానూ నిర్వచితమైంది.[1] సంఘర్షణ అనేది కథలో ఎక్కడబడితే అక్కడ రచయిత ప్రవేశ పెట్టేదీ కాదు దీని స్థితి ఆరంభంనుండే ఉంటుంది. కథానిర్మాణమే ఇతివృత్తం అనీ సంప్రదాయగతంగా వస్తూన్న నిర్వచనం.[2] ఇతివృత్తం చిన్న చిన్న కథా భాగాలు, ఉపకథలూ సంఘటనలతో నిర్మితమై ఉంటుంది. దీన్ని జర్మన్ సాహిత్యంలో కంపోజిషన్ అనీ, రష్యన్ సాహిత్యంలో మోటివేషన్ అనీ అంటారు కథ మొత్తం మీద లేదా విడదీయదగిన ప్రతి ముఖ్యమైన భాగం లేదా విషయం విడివిడిగా ఒక ఇతివృత్తం కలిగి ఉండవచ్చు. అయితే అన్నీ కలిసి వస్తువు (థీమ్)లో సమైక్యస్థితిని పొందుతాయి.

జీవితంలో ఎదుర్కొనే సంఘర్షణలో వ్యక్తి ఏ విధంగా ప్రతిక్రియ నెరపుతున్నాడు ? ఎట్లాపోరాడు తున్నాడు ? ఎట్లా పరిణామం చెందుతున్నాడు ? ఆ క్రమం ఏమిటి ? చివరకు పరిణతస్థితికెట్లా చేరు కుంటున్నాడు ? అనే అంశాలు నవల్లోని ఇతివృత్తంలో ప్రసక్తమౌతాయి. సంఘర్షణ స్వరూపం, వ్యక్తిశీలం చేత నిర్ణీతమౌతుంది. మానవుల విభిన్న మానసిక స్థితులూ వాళ్ళ అభిలాషలు ఉద్దేశాల సంఘర్షణలతో రూపొందే అనేకసంఘటనలతో ఇతివృత్తం ఒక క్రమ రీతి (డిజైన్)ని పొందుతుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే దేనితీరు దానిదే. పాత్రప్రమేయంలేకుండా ఏ సంఘట నల పరంపరకూ అస్తిత్వంరాదు. ఇతివృత్తంలో సంఘర్షణకు ఉద్దేశం, పర్యవసానం అనేవి రెండు ముఖ్యమైన అంశాలు. ఇవి పాత్రను ఆశ్రయించకుండా రాణించలేవు. ఇతివృత్తానికీ పాత్రకూగల సంబంధం చాలా సన్నిహితమైంది. ఇ. యమ్. ఫాస్టర్ ఇతి వృత్తానికన్నా పాత్రకు ప్రాధాన్యం ఇస్తాడు. హెన్రి జేమ్సు ఇతివృత్తానికి పాత్రకూ మధ్య అంతరాన్ని పాటించడు. నవల్నిగురించి సాహిత్యవిమర్శ ఎక్కు వౌతున్నకొద్దీ కథావస్తువు-ఇతివృత్తం, పాత్ర చర్య మధ్య భేదం గుర్తింపబడుతూ చాలా సూక్షసూక్ష్మంగా వివేచన చేయడం కన్పిస్తుంది. ఇతివృత్తం పాత్ర చర్యఅనేవి పరస్పరం పోషకాలుగా ఉంటూ నవల అవయవైక సంపూర్ణ రూపానికి దోహదం చేస్తూనే ఒక్కొక్కటి తమ ప్రత్యేకతన్నునిలుపుకొనే ధోరణినీ కలిగి ఉంటాయి మంచినవల్లో ఇవి గుర్తింపును పొందడమూ గమనించవచ్చు.

ఇతివృత్తం అనేది కథ యోజితమైన కొన్ని సంఘటనల క్రమరూపం. ఇందులో కథనం వర్ణనం వ్యాఖ్యానం వాతావరణకల్పనం వదిలేసి కథకు ప్రధానమైన యోజనారూపం మాత్రమే గ్రహింపబడు తుంది. ఇందులో ప్రధానమైనపాత్ర ఆలోచనా ధోరణి వ్యక్తం కావచ్చు. కథలో ఏంజరిగేదీ దీన్నిబట్టి చెప్ప వచ్చు. అంటే కథలోని గమనం స్పష్టంగా కన్పి స్తుంది. ఇతివృత్తానికి ఆరంభం మధ్య సమాప్తి అనేవి ఉంటాయి. పాత్రజీవితానికీ పుట్టుక, మధ్య చివర ఉంటాయి. ఈ పద్ధతి సర్వసాధారణమైంది. ఇది పురాతన ఐతిహాసిక నిర్మాణ సూత్రాన్ని జ్ఞాపకం

చేస్తుంది. ఆధునికకాలంలో కొత్త కొత్త సంవిధాన మార్గాలచేత ఈ క్రమంలో ఎన్నోమార్పులు తీసుకొని రావడం జరిగింది.

ఇతివృత్తాన్ని శరీర రూపానికి అస్థిపంజరంవలె నవలకు ముఖ్యమైందిగానూ, జీవం స్పందించడానికి అవసరమైన మృత్తికగానూ కొందరు విమర్శకులు భావించారు. కాని ఇతివృత్తం స్థూలమైన నిర్మాణ రూపంమాత్రమే కాదు. అనేకమైన అంశాలతో సంబంధం కలిగి ముఖ్యంగా పాత్ర సంఘటన అభిప్రాయంచేత పుష్టమౌతూ రచనలో అవసరమైన దాన్ని మొత్తంమీద ప్రత్యక్షంగానో పరోక్షంగానో అనుభవానికి రావడానికి సహకరిస్తూ తన అస్తిత్వాన్ని భావింపజేసే స్వరూపం కలదిగా స్థాపితమైంది. ఇందులో (1) అనేక సంఘటనల పరంపర రచయిత రచనా ప్రణాళిక ననుసరించి అవసరమైన క్రమంలో ఉంటాయి. (2) కాలాన్ని ఆశ్రయించిన గమనం ఉంటుంది (3) దీనికి మొదలు మధ్య చివర ఉంటుంది. (4) వివిధ భాగాలుగా పర్యాప్తమై ఉన్నా (ఇతర అంశాల సంబంధంచేత) అవయవ సమాపూర్ణమై ప్రత్యేకంగా గుర్తింపదగిన రూపాన్ని కలిగి ఉంటుంది. (5) రచనలో సమైక్య స్థితిని నిలిపే ఆధార నిర్మాణ రూపాన్ని పొంది ఉంటుంది.

ii

నవల్లో పాత్ర, చర్య, ఆలోచన అనే అంశాల సమన్వయ కథా నిర్మాణ రూపం ఇతివృత్తంలో బాగా కన్పిస్తుంది. కథలో గమనంవల్ల కాలం ప్రసక్తి తప్పనిసరిగా ఉంటుంది. ఎక్కడో ఒకచోట క్రమిస్తూ ఉండాలి, కాబట్టి స్థలమూ సూచిత మవుతుంది, లేదా ఈ విధంగా కాలమూ స్థలమూ ఇతివృత్తంలో స్పష్టమౌతాయి. దీని పరిశీలనం నవల్లో మరో లక్షణానికి దారి తీస్తుంది. అది కాలం స్థలంతో పాత్ర ఏవిధమైన సంబంధం కలిగిందీ, ప్రవర్తించేదీ, ప్రభావాన్ని నెర పేదీ తెలియ చేస్తుంది. ఒక లక్షణం మరో లక్షణానికి సరిస్తూ అనుబంధంతో అన్నీ పరస్పరం అక్కడక్కడా కలుస్తూపోతూ ఒక అల్లిక చివరకు నవల సమగ్ర రూపంలో ఆవిష్కృతం కావడం స్పష్టం. మానవుల కార్యకలాపాల చిత్రణతో ప్రభావితం చేసే దిశలో "ఉద్దేశమూ" ఆలోచనల్ని ప్రసరింప జేస్తుంది. ముందు ఏమి జరుగుతుంది? పాత్ర ఎదుర్కొనే సమస్య ఏమిటి? అది ఏలా ఆవిష్కృత మౌతుంది? అనేవి తెలుసుకోవాలనే ఉత్సుకతను ఇతి వృత్తం నిలపగలగాలి. పాత్ర అనుభవానికి వస్తూ కార్యరూపం ధరిస్తూపోయే అనేకమైన సంఘటనల క్రమ నిర్మాణ రూపానికి ఆధారం ఇతివృత్తం అవుతుంది. ఇది రెండు విధాలుగా యోజితం కావచ్చు. ఒకటి కాలక్రమం రెండు హేతుక్రమం 1. కాలక్రమంలో కథలో జరిగే అనేక సంఘటనలు వరుసగా పరిణమించే కాలం క్రమంలో యోజితమైన గతి స్వరూపాన్ని కలిగి ఉంటాయి. మొదటినుండీ తరువాత ఏమి జరుగుతుందోనన్న అభిలాషను అంకురింపజేసే లక్షణమూ కలిగి ఉంటుంది. పూర్వకాలపు నవలల్లో సాధారణంగా అవలంబించే విధానం ఇది. 2 హేతుక్రమంలో కథలో జరిగే సంఘటనలు, వీని వెనుకనున్న హేతువు క్రమంలో యోజితమైన గతి స్వరూపాన్ని పొందుతాయి. ఒక విషయం తరువాత మరో విషయం హేతు సహితమైన శిల్పదృష్టితో ప్రవృత్తం కావడంతో ఏమిజరుగు తూందన్నదే కాకుండా ఇట్లా ఎందుకు జరుగుతూందన్న ఆలోచననూ ప్రభావింప జేస్తుంది. ఇంకా ఏమి జరుగుతుందోనన్న సందేహంతో పాటు దీనికి కారణమూ వివరణమూ ఇతివృత్తానికి ఆలోచనా స్థాయిని కలిగిస్తాయి. పూర్వాపరక్రమం మారడంతో ఇతివృత్త నిర్మాణంలో తెలిసిన దారిలోనే పోకుండా కొత్త దారులతో చేకూరిన నవ్యత ఆకర్షణీయమైన రూపాన్నీ సిద్ధింపజేస్తుంది. కథలో ఏమిజరుగుతుందో నన్నదే లేకపోతే ఉత్సుకత ఉండదు. ఎందుకు జరుగుతుందన్నదే లేకపోతే ఆలోచనలేదు. విశిష్టంగా కొత్త పద్ధతిలో

నిర్మితం కాకపోతే ఆకర్షణ కోల్పోతుంది. కార్యకారణ సంబంధంతో పాత్రల చర్యపై దృష్టితో సంఘటనలు యోజనచేసే విధానం శిల్పం దృష్ట్యా ఉన్నత కోటికి చెందిందే. దీన్ని విజయవంతగా నిర్వహించడానికి రచయితకు కథ, దాని గమనంపైన, పాత్ర దాని చర్యపైన సంపూర్ణమైన ఆధిపత్యం ఉండాలి, ఇంకా తాను తీసుకవెళ్ళే దిశ గురించి స్పష్టమైన అభిప్రాయం నిశ్చయమైన విలువలు కలిగి ఉండటంతో పాటు, నేర్పు కూడా ఎంతో అవసరం ఔతుంది.

బలమైన ఇతివృత్తం పాఠకుని అభిలాషలో ఆలోచనలో ఆకర్షణలో ఉంచడమే కాకుండా కథను ప్రణాళికారూపంచేత, విశిష్టమైన మార్గంలో ఉంచుతుంది. దీనివల్ల నవలకు బాహ్యనిర్మాణంతోపాటు ఆంతరమైన వ్యవస్థకూడ రూపొందుతుంది. ఒక్కొక్క విధమైన నవల్లో ఇతివృత్తం ఎంతో ప్రాముఖ్యం వహిస్తుంది ఒక సమస్యను తీసుకున్నపుడు, కొందరు వ్యక్తులు ఆధారంగా ప్రత్యేక పరిస్థితుల చిత్రణంతో దానికి అనుకూల్యం, ప్రాతికూల్యంగల సామాజిక స్వరూపం అవసరమై ఇతివృత్తానికి ప్రాబల్యం కలుగుతుంది పాత్ర అనేక జ్ఞాపకాలను పురస్కరించుకొని వెనుకటి కథ చెప్పడం, స్వీయచరిత్రాత్మకం లేఖలు డైరీలు ఆధారంగా ఇతివృత్తం నిర్మాణంలో వైవిధ్యాన్ని సంతరించుకుంది. కొంతభాగం కాలక్రమం మరికొంతభాగం హేతుక్రమం అవలంబించి అవసరమైనచోట్ల ఇతివృత్తంలో విశిష్టతనూ ప్రదర్శించడమూ ఉంది. ఇవన్నీ నవల విశ్లేషణం పరిధిలో, వివేచన వల్ల మరింత అభివృద్ధిని సాధించడానికి ఉపకరిస్తుంది. ఎన్నిమాటలు చెప్పినా ఇతివృత్తం గురించి, అన్నీ ప్రయాణానికవసరమైన మార్గాన్ని చూపించే పటంవలె వివరణంవలె ఉపయోగ పడతాయన్న అభిప్రాయంతో కొంతవాస్తవం లేకపోలేదు. అయితే ప్రయాణం మొదలు పెట్టగానే అప్పటప్పటికి ఎదురయ్యే పరిస్థితుల్నిబట్టి అవసరమైన మార్పులూ జరగవచ్చు. కొంతవీ చోటు చేసుకోవచ్చు రచయిత వీటిని ఉపయోగించుకొనే తీరునుబట్టి నిర్వహించే సామర్థ్యాన్ని బట్టి ఆకర్షణతో ప్రభావంతో ఒక స్థాయిలో శక్తివంతంగా రూపొందుతుంది. ఈ విషయంలో రచయితకు ఎంతో స్వేచ్ఛ. ఇది ఒక్కొక్క నవల్లో ఒక్కొక్క విధమైన ఇతివృత్త నిర్మాణాన్ని పొందే అవకాశాన్ని కలిగిస్తుంది.

iii

ఇతివృత్తాన్ని విమర్శకులు పలు విధాలుగా వర్గీకరించారు. ఒకవిధం మొదటిది ఇతివృత్తనిర్మాణంలో ఐక్యతాసూత్రం స్వరూపాన్నిబట్టి రెండు రూపాల్లో ఉండవచ్చు 1 సాధారణం 2 మిశ్రమం అనేవి. సాధారణం (సింపుల్)లో ఇతివృత్తం కొన్ని పంక్తుల్లో సంగ్రహించడానికి వీలుగా పాత్ర అనుభవాలుసంఘటనలో వరుసగా సూటిగా చిత్రితమౌతాయి. ఇది ఒక కథలోను లేక రెండు లేదా అంతకన్న ఎక్కువకథల సమాహారంగాను ఉండవచ్చు 2 మిశ్రమంలో ఇతివృత్తాన్ని వెంటనే సంగ్రహించడానికి వీలు లేకుండా ఎన్నో పాత్రల అనుభవాలు సంఘటనలు ప్రత్యేక క్రమంలో యోజితమౌతాయి. అక్కడక్కడా చెదరి ఉన్నట్లు కన్పించే వివిధ భాగాలు ఐక్యతాసూత్రం చేత ఒకచోట నిబంధింపబడి సమగ్రతను కలిగి ఉటుంది. మధ్య మధ్య ఎన్నోస్వతంత్రమైన అంశాలు ప్రవేశిస్తూ ఉంటాయి. రచయిత వీటిని నవలమొత్తం మీద దృష్టితో సమభావంతో నిర్వహించవలసి ఉంటుంది. ఇందులో ఇతివృత్తం లోని వివిధ భాగాల మధ్య దేనికది విడివిడిగా ఉన్నట్లు అనిపించకుండా సంయోజనంలో ఐక్యతాస్థితి స్థాపితం కావాలి. ఇది రచయిత కళాదృష్టినీ నైపుణ్యాన్నీ ప్రదర్శిస్తుంది,

మరోవిధం, కథకు సంబంధించిన ముడిపదార్థాన్ని ప్రణాళికకవసరమైన విధంగా యోజనచేసే పద్ధతిని బట్టి రెండురకాలుగా ఇతివృత్తాన్ని విభజించవచ్చు 1, విశ్లథం 2, సమైక్యం అనేవి. విశ్లథం (లూజ్) ఎన్నో అనవసరమైన సంఘటనలు పరస్పరం అంతగా

సంబంధంలేని అనేకమైన ఉపకథలతో యోజిత మౌతుంది. ఈ నవల్లో కథాసమైక్యత చర్యపై ఆధార పడకుండా కేంద్రస్థానీయంగా ఒక వ్యక్తిపై ఆధారపడి ఉంటుంది, అక్కడక్కడా ప్రధాన కథలోసహేతు కంగా సంబంధంలేని అనేక సంఘటనలు ఉపకథలు ఒకచోట నాయకునికి కట్టివేయబడతాయి. ఇతివృత్తం సర్వం ఒకే పాత్రనుఆశ్రయించి ఉంటుంది. అక్కడక్కడా అసక్తికరంగా ఏదో సంబంధం ఉన్నట్లు కన్పించవచ్చు. కాని మొత్తం మీద ఒక సమన్వయస్థితి లోపించి ఒకవికీర్ణస్థితినీ విశ్లథత్వాన్నీ కలిగిఉంటుంది. ఒకదృశ్యం మరోదృశ్యానికి దాటితీస్తూ, పాత్రలు ఒక దానినొకటి క్రాస్ చేస్తూ ఇతివృత్త నిర్మాణం బలహీనంగా రూపొందుతుంది. ఇందులో రచయిత ముందు గానే అంతా సిద్ధంచేసుకొని, పర్యవసానాన్ని కూడ నిర్ణయించుకొని తన అభిప్రాయానికభిముఖంగా సర్వమూ పరిణమింపజేసే ప్రయత్నం స్పష్టంగా కన్పిస్తుంది. 2 సకమైక్యం (ఆర్గానిక్)అక్కడక్కడా ఉన్న ఉపకథలూ సంఘటనల క్రమం సహజంగా సముచితంగా అవసరం మేరలో యోజితమై సమైక్య స్థితిని కలిగిఉంటూ, వివిధ పాత్రలు ఉండవలసినస్థితిలో ఉంటాయి. నవలమొత్తంమీద అమరికలో హేతు యుతంగా సావయవ సంపూర్ణంగా ఇతివృత్తనిర్వాహణం ఉంటుంది, హేతుసమన్వయంచేత అవయవ సమగ్రతచేత రచన కళాత్మకంగా రూపొందుతుంది. వీటిలో సామాన్యం లేదా సాధారణం, విశ్లథం ఇంచు మించు ఒకేవిధంగా కన్పిస్తాయి, మిశ్రమం సమైక్యం చాలావిషయాల్లో ఒకేవిధంగా అనిపిస్తాయి.

ఇతివృత్తాన్ని సాంఘికం పౌరాణికంచారిత్రకం రాజకీయం అనీ విభజించడమూ వస్తూఉన్నదే. నార్త్ రోప్ఫ్రై విమర్శకుడు కథలో ప్రత్యక్షమయ్యే నాయకుని బట్టి, దేవతలు, ఉన్నత ప్రకృతిగల మానవులు సామాన్యమానవులు, అధమ ప్రకృతిగలవారు నాయకుల ఇతివృత్తాలుగా విభజించాడు. ఇంకా మోదాంతం విషాదాంతం అనీ పూర్వంనుండి వాడుకలో ఉన్నది. ఒక్కొక్కకాలంలో ఒక్కొక్కరు ప్రసరించే దృష్టిని బట్టి అనేకవిధాలుగా వర్గీకృతమౌతూ ఇతివృత్తంలో కొత్తపార్శ్వాలు ఆవిష్కృతమౌతూ నవలపై ఉత్తమ విమర్శకు ఎంతగానో దోహదంచేస్తున్నాయి.

iv

పాత్ర, చర్య, ఆలోచన ప్రధానంగా నార్మన్ఫ్రైడ్ మాన్ మొదలైన విమర్శకులు ఇతివృత్తాన్ని మూడు విధాలుగా విశ్లేషించడం జరిగింది. 1 పాత్ర ప్రధాన మైనది 2 చర్యప్రధానమైనది. 3 ఆలోచనప్రధానమైనది. పాత్ర ప్రధానమైన ఇతివృత్తంలో పాత్ర ప్రముఖంగా కన్పిస్తుంది. మంచికోసం పాత్రలో మార్పు వస్తుంది. పాత్ర ఆలోచనలో మొదటినుండి మార్పుకనుగుణంగా సంస్కారలక్షణం రూపొందుతూంటుంది ఉదాత్తమైన ఆశయాలు నెరవేరడానికి ముందుగా క్లిష్ట పరిస్థితిలో జరిగే పరీక్షలకు తట్టుకొని విజయాన్ని సాధించడం జరుగుతుంది. ఒక్కొక్క పాత్ర ఆశయాలు ఆశలు కూలిపోవచ్చు. లేదా ఆ తరువాత ఏదో మార్పువచ్చి కొత్తజీవితం ఆరంభం కావచ్చు. ఇందులో అవాంతరభేదాలను బట్టి 1 పరిణతం 2 పరీక్షాత్మకం 3 సంస్కరణం 4 ప్రక్షీణం అనే నాలుగు విధాలుగా ఉండవచ్చు. చర్య లేదా (యక్షన్) ప్రధానమైన ఇతివృత్తం సర్వసాధారణంగా పూర్వంనుండి వస్తూన్న ఇతివృత్తస్వరూపమే ఇది. కథలో తరువాత ఏమి జరుగుతుందన్న అభిలాషను కలిగించేదిగా ఉంటుంది. ఇందులో పాత్రగతమైన ఆలోచనకు తక్కువ అవకాశం ఉంటుంది. ఇది చర్యను ముందుకు నడిపించ గలిగినంతమాత్రంలో కనీసపు అవసరాలకు తగినట్లుగా ఉంటుంది. ఇందులో అనుమానం, నిరీక్షణ. ఆశ్చర్యం లక్షణాలతో మౌలికమైన విషయం లేదా సమస్య చుట్టూ ఇతివృత్తం వ్యవస్థీకృత మౌతుంది. ఇందులో అవాంతరభేదాలనుబట్టి 1 కారుణ్య 2 శిక్షా 3 విషాద 4 ప్రశంసా 5 మనోరాగాత్మకం ఇందులో క్రమ

గానో లేదా హఠాత్తుగానో పాత్ర పరిస్థితిలో సంపూర్ణమైన మార్పు వస్తుంది.పాత్ర ప్రవర్తనం ఆలోచనా రూపంచేత ఒక నిశ్చయరూపాన్ని పొందుతుంది, ప్రభావితమూ ఔతుంది. ప్రధానపాత్ర (నైతికశీలం వెనుక నుండి) చర్యచేత ప్రేరితమవుతుంది. స్పష్టమైన ఆవిష్కారాన్ని పొందుతుంది. ఆలోచన లేదాభావనలో మార్పునుకోరే ఆశయం' అభిప్రాయం సిద్ధాతం ప్రపంచితమౌతుంది. ఇది ఇటీవలబాగా ప్రసిద్ధిలోకి వచ్చింది. ఒక సమస్యకు పరిష్కారం నిశ్చితమైన ఆలోచనా ప్రపంచంలో నిర్దిష్టమై ఉంటుంది. వ్యక్తి లేదా సమాజం శ్రేయస్సు దృష్ట్యా దృక్పథం తీర్చబడుతుంది. పాత్ర ప్రవర్తనలో చెప్పుకోదగిన మార్పు ఉండదు. పాత్ర ధోరణి ఒక్కొక్కప్పుడు విపరీతంగానూ ఉండవచ్చు ఇది చింతనా ప్రధానంగా, లక్ష్యనిర్దేశకంగా ఉంటుంది ప్రధాన పాత్రలో వచ్చేమార్పు, పరిణామం దీనికి దోహదం చేసేదిగా ఇతివృత్తం నిర్మితమౌతుంది. ఇందులో అవాంతర భేదాలను బట్టి నాలుగు విధాలు 1విజ్ఞానాత్మకం 2 సత్యప్రకాశనం 3 ప్రభావశీలం 4 నిరాశామయం.

ఈ వివేచనం ఇతివృత్తాన్ని చాలా నిశితంగా పరిశీలించి ఉత్తమ విమర్శచేత ఆలోచనా పరిధినిపెంచేందుకు అనుభూతి సాంద్రతను అవకాశమిచ్చేందుకూ, దీనిపై అభివృద్ధిని సాధిస్తూ సాహిత్య ప్రమాణాల దృష్ట్యా ఎంతో ఉపకరిస్తుందనడంలో సందేహములేదు వీటిలో చర్యప్రధానమైన ఇతివృత్తాన్నే చాలామంది అంగీకరించడం జరిగింది. ప్రతిమంచి నవల్లోనూ ఇతివృత్తానికి ప్రధానపాత్రలో పరమార్థంలో విడదీయరాని సంబంధం స్పష్టంగా గుర్తించవచ్చు. ఇతి వృత్తంలో పాత్ర అనుబంధంతో చర్య మూడుదశలుగా పరిణమిస్తుంది 1 ఆరంభం (బిగినింగ్‌లేదా రైజింగ్) 2పతాక (క్లైమాక్స్) 3 సమాప్తి (ఎండ్ లేదా ఫాలింగ్) ఇవన్నీ ఎట్లాఉన్నా ఇతివృత్తంలో ఒక క్రమమైన సుస్థితిని సాధించడానికి చర్య- పాత్ర- ఆలోచన మూడింటి సంపూర్ణమైన సహయోగం అవసరం. రచయిత ఆశయాన్ని బట్టి ఒక్కొక్కటి ప్రముఖంగా కన్పించడం సహజం

ఈనాటి పత్రికా ప్రపచం నవల అభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతుంది. సీరియల్ నవలలు విరివిగా వస్తున్నాయి. సీరియల్ నవల్లో పతాక స్థానాలు ఎక్కువగానే ఉంటాయి. ప్రతి వారమో పక్షమో నెలకో దశలు దశలుగా ప్రకటితమయ్యేవి. అప్పటికప్పటికి ఆశ్చర్యాన్ని లేదా ఔత్సుక్యాన్ని నిలుపగలిగే అంశంతో ఆగి పాఠకుల్ని ఆరాటపెడుతూ ఉండవలసి ఉంటుంది ఏదో సమస్య ఉత్పన్నం కావడమో ఉన్న సమస్య గురించి ఆలోచనతోనో అనిశ్చితమైన స్థితితోనో అనుకోని మలుపు తిరిగే స్థితిరావడమోఏదోమరొకటి మరొకటి జరుగుతూ పోతూ ఉంటుంది. వచ్చే సంచికదాక పాఠకుడెదురుచూస్తూ ఉండేట్లు ఉంటుంది. ప్రతి సంచికలో కాకపోయినా నవల్లో చాలామార్లు ఈ విధంగా ఉండకపోతే సీరియల్‌లో ఆకర్షణ ఉండదు. సీరియల్ కుఉద్దేశించనిదానికి ఈ భేదం ఉంటుంది. ఇంకా కావాలనీ వేరే ఇతర కారణాలను పురస్కరించుకొనీ, ప్రకాశకుల పత్రికల కోరికపైనో ప్రచారంకోసమో మధ్యలో పాఠకుల అభిప్రాయాలను మన్నించేందుకో, వారి అభిప్రాయాన్ని సేకరించి లేదా పసిగట్టి కథ ఏ విధంగా మలుపులు తిరిగితే బాగుంటుందో ఆ విధంగా ఇతివృత్త నిర్మాణంలో మార్పులు జరగడమూ అప్పుడప్పుడూ తటస్థిస్తుంది. ఇది ఇట్లా ఉండగా నవల్లో ఇతివృత్తాన్ని సినిమా తీయడానికి వీలుగా తెరపై చాక్షుషమైన (విజువల్)ఆవిష్కారానికి అనుగుణంగా రూపొందించ

డానికి రచయితలు ప్రయత్నిస్తున్నారు. దీనికి ఆ కాలంలో చెలామణిలో ఉన్న రీతులు అవలంభించడం జరుగుతూంది. ఇవి చదువుతూంటే, పుస్తకరూపంలో మధ్య మధ్య చిన్న చిన్న ఆఘాతాలూ శూన్యస్థితులతో మనం సమాధాన పడలేని ధోరణిస్ఫుటంగా కన్పిస్తుంది నవల్లో అనేకమైన మనోభావాల స్పందనం, పాత్రల చర్యతో భాషారూపంలో ఇతివృత్తంని ర్మితమౌతుంది. ఇది సినిమాలో చాక్షుషమైన భావరూపాల (విజువల్ ఇమేజస్) తో ఎక్కువగా సాధింపబడుతుంది సాధారణ నవల్లో రచయిత దృష్టిప్రసారం వేరుగా ఉంటుంది ఇతివృత్తం ప్రవాహరూపంలో ఉంటుంది. ఇతరసాధనాల సహాయంతో సినిమాలో ఖండఖండాలుగా దర్శనమిస్తుంది. ఇందువల్ల సినిమాకు కావలసిన ఇతివృత్తం తీరు వేరు. నవల్లో దీన్నిపరిణామస్వరూపం వేరుగా ఉంటుంది. కొన్ని సందర్భాల్లో గొప్ప నవలలు, విశిష్టలక్షణంచేత సినిమా తీయడానికి తగినవిగా ఉండకపోవడం గమనించవచ్చు. సినిమాతీయాలంటే దాన్ని ఎంతో మార్చవలసి ఉంటుంది. ఇతివృత్తంలో ఈ మార్పులు అసలు నవలకు భిన్నంగా పరిణమిస్తాయి తెలుగులో నవల 'ఏక వీర' ఈ సందర్భములో గుర్తుచేసుకోవచ్చు 'వెదరింగ్ హైట్స్'నుసినిమా తీసే ప్రయత్నం జరిగింది. యథాతథంగా విజయాన్ని సాధించ లేక పోయింది. పత్రికలు, సినిమారంగం. నవల్లో ఇతివృత్త నిర్మాణంలో కొంత మార్పును తీసుకొని వాచ్చాయన్న విషయమే ప్రస్తుతాంశం పూర్వం నవల్లో ఇతివృత్తం సూటిగా తీర్చిన సంఘటనలతో పాత్రల అవ్యవస్థ గతిలో మలుపులతో అక్కడక్కడా ఆశ్చర్యకరమైన విశేషాంతో నిర్మితమయ్యేవి, మధ్య మధ్య ఏర్పడే ఒడుదుడుకులు విషమస్థితులు చివరకు సర్దుకొని సమస్యలన్నీ చక్కబడి చివరకు మంచికి గెలుపు లభించిదం జరిగేది. ఈనాడు ఏదిమంచి? ఏది చెడు? అనే ప్రశ్నకు సమాధానమివ్వడం అంతసులభం కాదు సామాజిక ఆర్థిక రాజకీయవైయక్తిక మనస్తత్వ పరమైన అనేకాంశాలను హేతుదృష్టితో పరిశీలించడం చేత నిర్ణయం చేయవలసి ఉంటుంది. సంప్రదాయ దృష్టికి ఒక విధంగాతోస్తే, పరివర్తనాదృష్టికి మరో విధంగా తోస్తుంది. ఇది స్థూలంగా మాత్రమే. ఈ కారణంగా ఎప్పటికపుడు ఇతివృత్త నిర్మాణంలోనూ ఎన్నో విషయాల సమీకరణంవల్ల నివృత్తిలో భేదాల వల్ల అనేకరూపాలు ఉదయిస్తాయి. వస్తువులను ఎన్నుకోవడం దాన్నియోజనచేయడం. అది తీసుకొనే మలపులు, పర్యవసానం, రచయిత దృక్పథాన్ని బట్టి కొత్తదనాన్ని అన్వేషించే ధోరణి ప్రబలుతోంది.

రచయిత అభిప్రాయాలూసిద్ధాంతాలు ఇతివృత్తం గమన వైఖరిపై ఎంతో ప్రభావాన్ని నెరపుతాయి. ఇతివృత్తం పాత్ర చర్యవల్ల విధ్వంసకంగానో నిర్మాణశీలంగానో నిర్మితం కావచ్చు. అయితే ఇతివృత్తంలో మౌలికమైన అభిప్రాయానికి భిన్నంగా ఏదీ చేర్చకూడదు. రచయిత సంఘటనలను స్థితులను ఎన్నుకోవడమే కాకుండా వాటిని ఆకర్షణీయమైన క్రమంలో కూర్చవలసి ఉంటుంది ముఖ్యమైన దానితో పాటు అవాంతర సంఘటనలు, హేతుబద్ధంగా పరస్పర ప్రభావజనకంగా తీర్చినవుడే ఇతివృత్తానికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. ఎట్టి పరిస్థితిలోను రచయిత ఏవోవిధంగా పని కట్టుకొని లాక్కొనుపోతున్నా డన్న భావన రాకూడదు. ఇది తప్పసరి సహజమైంది' సముచితం అన్న అభిప్రాయమే కలుగుతూ పోవాలి ఇది ఖండ ఖండాలుగా కాక మొత్తంమీద ఏర్పడి ఉండటానికి కళాదృష్టి అవసరం. జీవితానుభవం రోజు రోజుకూ జిజ్ఞాసాత్మకంగా ఎంతో వైవిధ్యోపేతంగా విస్తృతి

చెందే నేటి సమాజంలో రచయితల ఆధునికదృష్టితో అన్వేషణాతత్పరత, ప్రయోగనైపుణి వల్ల కొత్తకొత్త పార్శ్వాలలో సంవిధాన శిల్పంలో ఇతివృత్తం రూపొందుతుంది.

ఇతివృత్తం నవల్లో పాత్ర, ఉద్దేశమూ ఇతరమైన వానిచేత గమనాన్ని లక్ష్యాన్ని స్వరూపాన్ని పొందుతుంది. రచయిత ప్రత్యేకంగా శ్రద్ధవహింపదగిన ప్రధానలక్షణాల్లో ఒకటి.

రీడర్
క్వార్టర్ నెం14
కాకతీయా యూనివర్శిటీ
వరంగల్ - 506009

## ఉపయుక్త గ్రంథాలు

1 Dorothy Van Ghent: English Novel-Form and function

2 E.M. Forster: Aspecks of the Novel

8 Robert Lindell. A treatise on the Novel

4 The Anatomy of the Novel; Morjorie Boulton

5 William C.Knotf The craft of Fiction-

---

Foot Note :

* "Plot can be defind as a series of connected incidents all filled with tension and conflict that path of a lead charector takes in his search for a way out of his difficulties"-- William C. Knott--The craft of fiction
* A narrative structure of the play, tale or Novel has traditionally been called plot.

# అనంతపురం మండలం సరిహద్దు ప్రాంతాల్లో కనిపించే విలక్షణమైన పదజాలం–ఒక పరిశీలన.

—ఆదవాని హనుమంతప్ప

అనంతపురం మండలం కర్నాటక రాష్ట్రానికి సరిహద్దులో వుంది. అందువల్ల ఈ ప్రాంతం వ్యవహారంలో కన్నడ ప్రభావం ఎక్కువగా వుంది. వాక్యాల్లో కంటే కన్నడ ప్రభావం పదాల్లో విపరీతంగా వుంది. ఇక్కడి ప్రజలు కొన్ని కన్నడ పదాల్ని యథాతథంగా వాడతారు. కాకపోతే ఆ పదాలకు తెలుగు భాషా సహజమైన ప్రత్యయాలు డు ము వు లను చేర్చి వాడతారు. మరికొన్ని కన్నడ పదాల్ని మరికొంత మార్పుతో వ్యవహరిస్తారు. సరి హద్దుకు మరీదగ్గరగా వున్న ప్రాంతాల్లో కన్నడపదాలు, తెలుగు, తెలుగు-కన్నడ పదాల సమ్మేళనం విపరీతంగా విన్పిస్తుంది. కొన్ని పదాల్లో - ఒకే అర్థానిచ్చే తెలుగు, కన్నడ పదాలు రెంటినీ కలిపి వ్యవహరించడం ఈ ప్రాంతంలో విలక్షణంగా కన్పిస్తుంది. కన్నడనుంచీ వచ్చిన పదాలు కోకొల్లలుగా వున్నాయి. హిందూస్థానీ నుంచి వచ్చి కన్నడలో స్థిరపడ్డ కొన్ని పదాలు ఈ సరిహద్దు ప్రాంతంలో మాత్రమే విన్పించడం విశేషం. ఈ కింద వివరించబోయే విలక్షణమైన పదాలు కేవలం అనంతపురం జిల్లాలోనేగాకుండా కర్నాటకకు సరిహద్దుగా వుండే ఇతర ప్రాంతాల్లో కూడా వినిపించవచ్చు పొరుగు రాష్ట్ర భాషా ప్రభావం ఇంకో రాష్ట్ర సరిహద్దు ప్రాంతాలపై పడటం భాషకు సహజం. కన్నడ ప్రభావంతో కనిపించే ఈ పదాల్ని ఏ పద్ధతిలో వ్యవహరిస్తున్నారో పరిశీలించడం ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యం.

ప్రాథమిక స్థాయినుంచి కళాశాలస్థాయి వరకు తెలుగు బోధనా భాషగా వున్న ఈ రోజుల్లో సమగ్ర ఆంధ్ర నిఘంటు నిర్మాణం అవసరమవుతుంది. అందువల్ల మన రాష్ట్రానికి నలువైపులా సరిహద్దు ప్రాంతాల్లో ఆయా పొరుగురాష్ట్రాలభాషా ప్రభావం ఏ విధంగా వున్నదీ ఇలాంటి తెలుసుకోవడానికి భాషా పరిశోధనలు ఎంతైనా తోడ్పడతాయి.

ఆయా పదాలు ప్రజల వ్యవహారంలో ఏ విధంగా వున్నదీ కింద వివరించడం జరుగుతుంది.

**అగత్యంగా** : * క. అగత్య. 'తప్పకుండ'. నేను శుక్రవారం నా డగత్యంగా వస్తాను అంటే 'నేను శుక్రవారం నాడు తప్పకుండా వస్తాను'—అర్థం

**అంగీ** : క అంగి. 'చొక్కా'. అంగీ తొడుక్కోరా బిరీన సినిమాకి పోదాం. చొక్కాకు అంగి అనే వ్యవహారం ఇక్కడ వినిపిస్తుంది. ఈ సరిహద్దు ప్రాంతాల్లో చొక్కా అన్న పదమే లేదు.

**అప్ప** : క. అప్ప. 'నాన్న'. నాన్న అనే అర్థంలోనే కాకుండా వేరొకరిని సంబోధించడానికి కూడా ఈ అప్పపదాన్ని వాడతారు.

ఇంత సేపు యాటికి పోయింటివప్పా 'ఇంతవరకు ఎక్కడికి వెళ్ళివుంటి వయ్యా'.

తండ్రిని నాన్నా అనిపిలవడం కంటే కూడా ఈ ప్రాంతాల్లో అప్పా అనిపిలవడమే ఎక్కువ.

**అరకువ** : క. అరకె 'జీర్ణము '. నాకన్నము అరకువ కాలేదు 'నాకన్నం జీర్ణం కాలేదు'.నాకన్నం అరగలేదు. అనికూడా వ్యవహారంలో వుంది.

**అసడ్డం** : క. అసడ్డె 'ఆటంకం' ఈ పొద్దు వూరికి పోదామంటే అన్నీ అసడ్డాలే. 'ఈ రోజు వూరికి పోదామనుకుంటే అన్నీ ఆటంకాలే'.

**ఆసామి** : క. అసామి'వ్యక్తి' అనే అర్థంలో కన్నడవాళ్ళు వాడతారు. అదేపదాన్ని యిక్కడ వ్యవహర్తలు ధనవంతుడు అనే అర్థంలో కూడా వాడతారు.

అతకేమప్పా పెద్దాసామి (పెద్ద + ఆసామి) అతనికేమయ్యా గొప్ప ధనవంతుడు'

**ఆయం** : క. ఆయ 'సంప్రదాయమైన కొలతలు ఇల్లుకట్టడానికి ముందు సంప్రదాయమైన కొలతలు వేయడాన్ని 'ఆయం'అంటారు.

ఇల్లు కట్టడానికి పునాదులు తీసేదానికి ముందు కొలతలు వేస్తారు. ఈ కొలతలలో దేవునిమూల(దేవుని గది) కట్టవలసినచోట మిగిలిన (గదుల) కొలతలకంటే కొంచం ఎక్కువగా తీసుకుంటారు. అట్లా తీసుకునేటప్పుడు ఏ దిశకు ఎక్కువ కొలతలు తీసుకుంటే అదృష్టము బాగా కలిసి వస్తుందో ఆ దిశకు ఎక్కువ తీసుకుంటారు. ఆయం వెయ్యకుంటే యిల్లుకడితే ఆ యిల్లు వృద్ధిచెందదని ఒక నమ్మకముంది. ఇలాంటి కొలతలనే ఆయం అని అంటారు.

**ఇక్కు** : క. ఇక్కు 'పెట్టు ఉంచు' పిల్లలు బొద్దిగుండ్లాట ఆడేటప్పుడు గుండును రెండు బొద్దీల నడుమ పెట్టవలసి వచ్చినపుడు నడుమిక్కప్పా నీ గుండు (నడుమ + ఇక్కు) అని అంటారు. అంటే 'బొద్దిగుండును మధ్యవుంచు' అనిఅర్థం

**ఈలకత్తి** : క. ఈలకత్తి 'కత్తిపీట' కూరగాయలు కోసుకునే కత్తిపీటను ఈలకత్తి అని వ్యవహరిస్తారు.

**ఉబ్బసము** : క. ఉబ్బస. 'ఆస్తమా, ఆస్మా ఆయాసం' శ్వాసకష్టంగా జరగటాన్ని ఉబ్బసం అంటారు. దీన్నే ఆయాసం అనికూడా వ్యవహరిస్తారు.

**ఉసులుగొట్టు** : క ఉసిరు కన్నడలో శ్వాస అని మాత్రమే అర్థం కానీ దీన్ని తెలుగులో వ్యవహరించే సందర్భాన్ని బట్టి వేగంగా శ్వాస జరపటం, లేదా బాధతోశ్వాస జరపటం అనే అర్థాలు చెప్పుకోవాలి

కూరలో కారమెక్కువగా ఉన్నప్పుడు పెదవులకు నాలుకకు మంటకల్గుతుంది. ఆ మంట కల్గినప్పుడు దీర్ఘంగా శ్వాస జరపటాన్ని ఉసులుగొట్టడం అంటారు

ఏమి అంతగా ఉసులుగొడ్తావు. కారం శానా ఎక్కువయిందా (కూరలో)అని అడుగుతారు.

**ఎదురు బదురు** ; క. ఎదిరిబదిరి 'ఎదురెదురు' మీ రిద్దరూ ఎదురుబదురుగా కూర్చున్నారే. ఏం పని లేదా అని వ్యవహారం

**ఒదురు** : క. ఒదరు 'గొణుగు 'ఏం నీలో నువ్వే ఒదురుకుంటావు.'ఏం నీలో నువ్వే గొణుగుకుంటావు.'

**ఓకుళ్ళు** : క. ఓకుళి 'రంగునీరు' వసంతపు నీరు.

ఉగాది మరుసటినాడు వసంతం ఒకరికొకరు చల్లుకోవడం రాష్ట్రమంతా వుంది,కొత్తసంవత్సరం పండుగ కాబట్టి వసంతాలు చల్లుకుంటారు. ఈ వసంతాలు చల్లుకోవడాన్ని ఓకుళ్ళు చల్లుకుంటారు అని వ్యవహారం దృష్టిదోషం తీసివేయడానికి ఉపయోగించే రంగునీటిని కూడా ఓకుళ్ళు అంటారు.

**కడా/కడాన** : క.కడె. 'కడపటి. చివరి రామయ్య ఇల్లుఎక్కడుంది? అని అడిగినపుడు ఆకడా యిల్లే సూడి అని చెప్తారు 'ఆ చివరి యిల్లు చూడు అని అర్థం

**కసువు** : క. కస. 'దుమ్ము,చెత్త'

**కాయ్‌లా** క.కాయ్‌లే (హిం.కాహిలే) 'జబ్బు' మా పెద్దన్న నెలదినాలు కాయ్‌లాతో పడపోయిండె 'మా పెద్దన్న నెల రోజులు రోగంతో పండుకొని వుండెను కాయ్‌లా అనే ఈ పదాన్ని రెండు మూడు రోజులు వచ్చే జ్వరానికి వ్యవహరించరు. దీర్ఘరోగాలకు మాత్రమే కాయ్‌లా అని ఇక్కడ వ్యవహరిస్తారు. కన్నడలో ఎలాంటి జబ్బుకైనా కాయ్‌లే అని వ్యవహరిస్తూంటే ఇక్కడి ప్రాంతం వారు దీర్ఘరోగానికి మాత్రమే వ్యవహరించడం అర్థసంకోచంగా చెప్పవచ్చు

**కాయు** : క. కాయు, 'కాపాడు'. వాడు చేను కావలి కాస్తున్నాడు. 'వాడు చేను పైరును కాపాడుతున్నాడు'. పైరును పశువులనుంచీ దొంగల నుంచీ కాపాడుతున్నాడని భావం.

'కాపాడు' అర్థంలోనే కాకుండా to waite అనే అర్థంలో కూడా వ్యవహరిస్తారు. కాయుకు to waite అనే అర్థం రాష్ట్రమంతా వుంది. కాని కాపాడుతున్నాడు అనే అర్థంలో వాడడం కన్నడ ప్రభావమే అని అనుమానించవచ్చు.

**కిసురు** : క. కిసె. జేబు. బతాణిలు కిసుర్లో వేసోక్రా'. జేబులో వేసోక్ర అని కూడా ఇక్కడి వ్యవహారంలో వుంది. కర్నాటకకు చాలా దగ్గరగా వున్న ప్రాంతాల్లో మాత్రం కిసురు Srequency ఎక్కువ.

**కుణుసు/కుణి** : క. కుణి. 'నాట్యం చేయు, అడుగులు తొక్కు'. వాడు బలే కుణుస్తాడు అని వ్యవహారం. 'వాడు బలే అడుగులు తొక్కుతాడు'. ఆయమ్మ బలే కుణుస్తుంది అన్నప్పుడు 'ఆమె బలే నాట్యం చేస్తుంది అని అర్థం. బయల్నాటకంలో లయబద్ధంగా అడుగులు తొక్కడం ఒక పద్ధతి ఇక్కడ వుంది. (పాటకు అనుగుణంగా). ఆ అడుగులు తొక్కడాన్ని కుణిసేది అంటారు.

**కుప్పలించి/కుప్‌లించి/కుప్పిడిసి**: క. కుప్పలిసు. 'రెండుకాళ్ళు దగ్గరకు చేర్చి'. కుప్పలించి అంటే రెండు కాళ్ళు దగ్గరకు చేర్చి ఒకేసారి దూకు అని అర్థం.

**కువ్వాదం** : క. కువ్వాద, 'పరిహాసం, తమాషా' పెద్దవాళ్తో కువ్వాదం చేసేది మంచిదికాదు. 'పెద్దవాళ్ళతో పరిహాసం చేయడం మంచిది కాదు'.

**కెమ్ము** : క. కెమ్ము. 'దగ్గు'. నాకు పడిశం బట్టి కెమ్మొస్తా వుంది. 'నాకు జలుబుచేసి దగ్గు వస్తుంది'.

**కొళాయి** : క. కొల. 'పంపు'

**కొళకు** : క. కొళకు 'గలీజు, dirty', మజ్జిగ కొళుకులు కొళుకులు వుందే అని వ్యవహారం. విరిగిపోయిన పాలను కూడా కొళుకులు కొళుకులు వుంది అంటారు. కాబట్టి కొళుకులు అన్న పదానికి విరిగిపోయినవి అనే అర్థం కూడా చెప్పుకోవచ్చు.

**కామిడిబిల్ల** : క. కామనబిల్లు. ఇంద్రధనస్సుకు కామిడిబిల్ల అంటారు.

**కోలు** : క. కోలు. 'కట్టెతోచేసిన కాము' చేతి కోలకు చేసిన పిడిని కోలు అంటారు. తెలుగులో చేతి కోల అనివుండగా శలకోలు అని ఇక్కడ వ్యవహరించడం కన్నడప్రభావం. ఇంకా కొన్ని ప్రాంతాల్లో ఈ పదానికి బారుకోలు అనే వ్యవహారం వుంది. కన్నడ పదమైన బారుకోలును యథాతథంగా వాడతారు. దీన్ని ఎద్దులను తోలడానికి ఉపయోగిస్తారు.

**గిరు** : క. గిరు. 'రుద్దుకొను'. వాడు గజ్జి పట్టి గిరుకుంటున్నాడు.

**గుడిసిలి** : క. గుడిశలు. 'చిన్నకొట్టము, గుడిసె అన్నది. తెలుగు వ్యవహారంకాగా గుడిసిలి అన్నది కన్నడ ప్రభావం.

గుడుగు : క. గుడుగు. 'ఉరుము'. మోడాలు గుడుగుతావుండాయి. 'మబ్బులు ఉరుముతున్నాయి'.

గుల్ల : క. గుళ్ళె. 'బొబ్బ,కురుపు'. శరీరానికి పుట్టిన కురుపును ఇక్కడ గుల్ల అని వ్యవహారం. బొబ్బను కూడా గుల్ల అంటారు.

గుళిగి ; క. గుళిగె 'tablet, మాత్ర

గూటము ; క గూట 'గుంజు' పశువులను కట్టివేసే గుంజును ఇక్కడ గూటము అంటారు,అంతే కాకుండా చేసులో గుంటుక పాయునవుడు గుంటుకను అదిమి పట్టుకోవడానికి ఉపయోగించే ఊత కట్టెను కూడా గూటము అని అంటారు.

గూరు ; క గూర/ కోర 'కోరింతదగ్గు' ఆ పిల్లోనికి గూరు దగ్గుంది 'ఆ పిల్లవానికి కోరింత దగ్గుంది' శ్వాసపీల్చినపుడు కొర్ కొర్ అన్నశబ్దం వస్తుంది. దాన్ని గూరు అని అంటారు.

గెడపు : క. కెడపు 'కిందకు పడవేయు' బలా బలాలు పరీక్షించుకుంటున్నప్పుడు- నన్ను గెడపేసు కుంటవా- అంటారు 'నన్ను కిందకు పడవేయగలరా అని అర్థం. బండి వాటు గెడిపేసినాడు 'బండిని కిందికి పడవేశాడు'

గెదరు ; క. కెదరు 'పెల్లగించు, తీసివేయు ఉంగరం లాంటిది యిసుకలో పూడి పోయినప్పుడు ఈడ గెదరు కనిపిస్తుందేమో- అంటారు. ఇక్కడ గెదరు అంటే యిసుకను తొందరతొందగా వెనక్కి తీసివేసుకుంటూ పోవడాన్ని గెదరు అంటారు.

గెరి : క. గెరె 'గీత, గీటు'

గేరి : క.కేరి 'వీధి'రాష్ట్రమంతా 'వీధి' వ్యవ హారంలో వుండే ఈ ప్రాంతంలో గేరివుండటం విశేషం- కురవగేరి బాయగేరి 'కురువవీధి' బోయ వీధి! అంటే కురువాళ్ళు బోయవాళ్ళు నివసించే వీధి అని అర్థం.

గౌన గొల : క. గౌనె 'గెల' బాళెపండుగౌన 'అరటిగెల' అని కాకుండా బాళెపండు గౌన అని వుండడం కన్నడ ప్రభావం న,ల లవినియమం తెలుగులో సర్వసాధారణం (తెలుగు, తెనుగులాగ) కనుక గొల అనికూడా వ్యవహారంలో వుంది. తెలుగులో అరటిపండు అని వుండగా క. బాళెహణ్ణు అన్న పదాన్ని బాళె పండుగా ఇక్కడ వ్యవహరిస్తారు. ఈ వ్యవహారం మిగతా ప్రాంతాల్లో లేదు.

గొబ్బరం/కొప్పరం : క గొబ్బర. 'ఎరువు' మీ చేనికి కొప్పరం సల్లినావా. 'మీ చేనుకు ఎరువు వేసినావా?

గోటు : క. గోటు 'గట్టి, కఠినం'. గోటొక్క పేడు అని వ్యవహారంలో వుంది. (గోటు + పేడు> గోటొక్కపేడు). కొరకడానికి గట్టిగా వుండే వక్క అని అర్థం. వక్క అని కాకుండా ఇక్కడ వక్కపేడు అని వుండడం కూడా కన్నడ ప్రభావమే

గొరక : క. గొరకె. 'గురక'. గురక అని తెలుగులో వుండగా ఈ ప్రాంతల్లో గొరక వుండడం విశేషం వాడు నిద్రలో బలే గొరకపెడతాడు. 'వాడు నిద్రలో బలే గురక పెడతాడు.

గోరు : క. గోరు వరిమడి నాట్లు వేయడానికి ముందు మట్టినంతా చదును చేయడానికి ఉపయోగించే సాధనాన్ని గోరు అంటారు, ఇలాంటి సాధనాన్ని కోస్తా వ్యవహారంలో ఏమంటారో తెలుసుకోవాల్సివుంది

చటం శటం : క. చట 'అలవాటు' ఎదైనా ఒక దానిని అలవాటుపడితే (ప్రొగతాగడానికి, మత్తు పానీయాలు తాగడానికి)అదిలేకుండా ఉండలేక పోవడాన్ని శటం అంటారు. శటంలేసింది. బీడీ ఈయప్పా బీడి కాల్చాలని పిస్తుంది (బీడి) ఇవ్వవయ్యా.

చమ్మెటు సమ్మెటు సమ్మిటి : క. చమ్మటి 'సుత్తి'

చిమానూని సిమానూని : 'కిరసనాయిలు, గబ్బు నూనె' కన్నడలో దీన్ని సీమఙ్ణె (సీమ + ఎణ్ణె) అని అంటారు.

**చిముకురించు** : క. చిముకరిసు 'tosprinkle'వెదజల్లు ప్యాణ్ణీళ్ళు చిమ్కిరి 'పేడనీళ్ళు (కల్లాపు చల్లు'

చెండు : క. చెండు 'బంతి'రాష్ట్రమంతా బంతి అనివుంటే ఇక్కడ చెండు అని వుండడం విలక్షణం.

**చౌకం/చౌకంగుడ్డ** క. చౌక 'చేతిగుడ్డ' ఆ చౌకం తీసుకో. ఆ చౌకంగుడ్డ తీసుకో. అని రెండురకాలుగా ఇక్కడ వ్యవహారంలో వుంది. చేతిగుడ్డ అనే వ్యవహారం అసలులేదు విద్యావంతుల్లోతప్ప.

**జనము** : క. జన 'మంది' ఎంతజనం వచ్చినారు. ఎంతమందివచ్చారు ఇది "కన్నడలో ఎష్టుజనబందార" అనడానికి తర్జుమా అన్నమాట. త్వరితోచ్చారణలో ఎన్ని జనాలొచ్చి (జనాలు + వచ్చి) నారు అంటారు. తెలుగులో ఎంత, ఎన్ని అన్న పదాలకు కన్నడలో 'ఎష్టు'అన్నిది మాత్రమే వుంది. ఎంత ఎన్నిలకు వేర్వేరు పదాలు కన్నడలో లేవు. అందువల్ల కన్నడ ప్రభావం తో ఎన్ని జనాలు వచ్చినారు అని వ్యవహారంలో వుండడం ఈ ప్రాంతానికి మాత్రమే పరిమితం

**జాగా** : క. జాగ (హం జాగా) 'చోటు'రామారావు వచ్చినపుడు యాడాడ కూకునేకి జాగానే ల్యాంకుండా జనం వచ్చిడిసినారు లామారావు వచ్చినప్పుడు ఎక్కడెక్కడా కూర్చోడానికి చోటేలేకుండా ప్రజలు వచ్చేశారు. పైవాక్యంలో వచ్చిడిసినారు అనేక్రియ కనిపిస్తోంది. ఈ ప్రాంతంలో పరిపూర్ణార్థంలో ఇట్టి క్రియను వాడతారు.[2] ఇదీ కన్నడ ప్రభావమే.

**జొల్లు** క. జొల్లు 'ఎంగిలి' వాడు జొల్లు కార్చుకుంటారు.'వాడు ఎంగిలి కార్చుకుంటాడు

**జోపానం** : క.జోపాన 'జాగ్రత్తగా కాపాడటం పైరును బాగా జోపానం చేసుకుంటే పంట బాగా పండుతుంది. పైరులో కలుపుతీసుకొని ఏదైన రోగం వచ్చినపుడు మందులు కొట్టేటువంటి మొ॥పనులు బాగా పనిచేస్తూ కాపాడుకుంటే పంటబాగా పండుతుంది అని పై వాక్యానికి భావం.

**డాబు/డాబు** : క. డాబు. 'ఒడ్డాణము' నడుముకు ధరించే ఒడ్డాణాన్ని డాబు అని పిలుస్తారు. ఇక్కడ కన్నడలో వున్న దాన్ని యథాతథంగా వాడుతున్నారు.

**దేవు/దేగు** : క. దేవు 'త్రేన్పు'. నా కన్నం అరకువల్యాక (లేక) పుల్ దేవులు (పుల్లనిదేవులు) వస్తున్నాయి. 'నా కన్నం జీర్ణం కాక పుల్లత్రేన్పులు వస్తున్నాయి. ఈ ప్రాంతంలో దేగులు, రెండూ వ్యవహారంలో వున్నాయి. గ > వ కావడమూ వ > గ కావడమూ పరిపాటి. కాబట్టి ఈ రెండు ఉచ్చారణలూ వినిపిసాయి.

**తడవ** క తడవ. 'ఆలస్యం'. ఇంత తడవా చేసేది. 'ఇంత ఆలస్యమా చేయడం'

ఈ పదాన్ని ఇకో అర్థంలో కూడ వ్యవహరిస్తారు. ఎరువు మీ చేనకి ఎన్ని తడవలు తోలుతారు-అనే వ్యవహారం 'ఎరువును మీ చేనికి ఎన్నిసార్లు తోలుతారు అంటే ఒక్కరోజుకు ఎన్ని బండ్లు తోలుగలుగుతారు . భావం.

**తాలు** : క. తాళు. 'తట్టుకో, to Waite.' తాలు నేనొస్తాను. 'ఉండు నేనొస్తాను.'

కాలికి ముల్లు ఎవరికైనా విరిగినపుడు ఇంకొకరు ఆ ముల్లును తీస్తున్నప్పుడు తీయించుకునే వాడు బాధపడుతూంటే-కొంచెం తాలు ముల్లు వచ్చిడుస్తుంది [వచ్చి + విడుస్తుంది]—'కొంచెం వుండు ముల్లు వచ్చేస్తుంది.' బాధను కొంచెం సేపు తట్టుకోమని (ఓర్చుకొని) భావం.

2. పరిపూర్ణార్థ- వివరణకోసం. చూ. ఆదవాని హనుమంతప్ప తెలుగుమీద కన్నడ భాషా ప్రభావం భారతి 60-12 ([illegible]) పుట. 24.

**తిద్దు** : క. తిద్దు. 'దిద్దు, రుద్దు, సరిజేయు' తెలుగులో దిద్దు అనే పదం వుండగా తిద్దు అని ఇక్కడి వ్యవహారంలో వుండడం కన్నడ ప్రభావమే అనాలి

రుద్దు అనే అర్థంలో:- వాడు ఓనమాలు తిద్దుతా వున్నాడు.

**సరిజేయు** : అయ్యవారు పేపర్లు ఓద్దుతా వున్నాడు.

**తిరుగా** : క. తిరుగి. 'ఇంకోసారి (మళ్ళీ), వెను దిరుగు'. ఇంకోసారి (మళ్ళీ) అనే అర్థంలో : ఈ పని తిరుగా చెయ్యల్లా ? 'ఈ పని మళ్ళీ చేయాలా !' వెనుదిరుగు అనే అర్థంలో : అనంతపురం పోయి తిర్గా రా వల్ల 'అనంతపురం పోయి వెనుదిరిగి రావాలి : త్వరితోచ్చారణలో తిరుగాకు బదులు తిర్గా అని కూడా వినిపిస్తుంది.

**తురుకు/దురుకు** : క. తురుకు. 'బలవంతంగా దూర్చు.' పెట్లేకి అన్ని బట్టలు దురికితే బట్టలు నలిగి పోవా ! 'పెట్టెలోనికి చాలా గుడ్డలు దూర్చితే నలిగిపోవా!' గుడ్డలు పెట్టె నిండిన తర్వాత కూడా దూర్చితే గుడ్డలు నలిగిపోతాయని తాత్పర్యం.

**తెగ** : క తెగళు. 'తీర్పు'. మీ పంచాయితి యింకా తెగిందా లేదా ! 'మీ కేసు ఇంకా తీరిందా లేదా' అటో యిటో తెలిపోయిందా లేదా అని భావం.

**తొళకు** : క. తుళుకు. 'తొణకు' నిండు కుండ తొళకదు. 'నిండుకుండ తొణకదు.' ణకారం గాకుండ ళకారం వుండడం కన్నడ ప్రభావం.

**దుడి** : క. దుడి. 'పనిచేసి పెట్టు' ఈ ఎద్దులు మాకి బాగ దుడిసినాయి. 'ఈ ఎద్దులు మాకి బాగా పనిచేసి పెట్టాయి.' అంటే బాగా ఉపయోగ పడ్డాయని అర్థం.

**దుడుకు** : క. దుడుకు. 'అజాగ్రత్తగా' (పనిచేయు) ఈ పదం తెలుగులో గ్రాంధికంలో వుంది. కాని రాష్ట్రమంతా వ్యవహారంలో లేదు ఈ ప్రాంతంలో మాత్రం విపరీతంగా వ్యవహారంలో వుంది. అందు వల్ల కన్నడ ప్రభావమేమో నని అనుమానం.

ఏదైనా పని చేసేటప్పుడు సామానులేమైనా పగి లేస్తే నీవి దుడుకు చేతులంటారు. నీ చేతులే అజా గ్రత్త అని భావం.

**దోణి** : క. దోణ. 'నీరు నిలిచే చిన్న కుంట.' పని

పొలాల్లో చేసేటపుడు - ఆ దోణిలో నీళ్ళు తీసుకు రాపో అంటారు ద్రోణి అనే వ్యవహారం మిగతా ప్రాంతాల్లో లేని కారణంగానూ, ఈ ప్రాంతంలో మాత్రమే వ్యవహారంలో వున్న కారణంగానూ ఇది కన్నడ ప్రభావమని శంకించడానికి అవకాశ మయింది.

**నంజు** : క. నంజు. 'విషం' చిన్న పిల్లలు వాళ గాయాలను గోళ్ళతో గీకుతున్నప్పుడు - గోళ్ళతో గీకద్దు (గీక + వద్దు) నంజు పెట్టుకుంటుంది - అంటారు. నంజుకుంటే విషమయి తొందరగా గాయం మానిపోదని భావం.

**నాడి** : క. నడె/నడి. 'నడచు' తెలుగు పదమైతే 'నడచు'వుండాలి. అట్లాగాక కేవలం నడి అనే పదాన్ని యిక్కడ వ్యవహరిస్తారు.

నీవు ముందు నడి. 'నీవు ముందు నడచు '

**నసుకు** : క. నసుకు. 'చీకటి'కన్నడలో తెల్లవారు ఝామును నసుకు అంటారు. కానీ తెలుగులో విస్తృ తార్థంలో చీకటి అనేఅర్థంలో వాడతారు. నసుకయింది. చీకటి అయింది. కన్నడలో పరిమితార్థంలో వున్న ఈ నసుకను తెలుగులో వాడడం అర్థవ్యాకోచంగా చెప్పవచ్చు.

**నోరారికి** : క.బాయారికె 'దప్పిక' నాకు నోరా రికి పోయింది. నోరుఆరిపోయింది! నోరు ఆరిపోవడం (తేమ లేకపోవడం) వల్ల దప్పిక అయిందని భావం కల్గుతుంది, (క బాయి = నోరు)

**నాని** : క. నాని నెనె తడిసిపోవు; వానకు నాని పోయి వస్తి. వానకు తడిసిపోయి వచ్చాను

**నెత్తి** : క. నెత్తి తలపైభాగం నా నెత్తిన పెట్టు అని వ్యవహారం

**నెరవాజి నెరవాది** ; క. నెరె 'రజస్వల' రజస్వలఅయిన బాలికను ఇక్కడ నెరవాదిఅయింది అంటారు. ఇక్కడ దీనికి- అపిల్ల పెద్దమనిషయిందని వ్యవహారంలో వుంది. దీనితోపాటు- నెరవాదికూడా వుంది. పెద్దమనిషిఅయింది- అనడానికంటే- నెరవాది అనడం సౌమ్యోక్తిగా వుంటుందని వ్యవహర్తలు ఈ విధంగా అంటారేమో.

**పల్లెం** : క పల్య 'వేపుడుకూర ఏదైనా సరే కూరగాయలతో తాళింపు తాళింపును ఈ ప్రాంతంలో పల్లెం అనడం విలక్షణంగా వుంది.

**పగ్గాలు** : క. హగ్గగళు 'తాళ్ళు'

**పుట్టి/పుట్టిగంప** : క. పుట్టి 'చిన్నగంప' కన్నడలో ఏ గంపనైన పుట్టి అంటారు. ఇక్కడ చిన్నగంపను మాత్రమే పుట్టి అనిగాని పుట్టిగంప అనడాన్ని అర్థసంకోచంగా చెప్పవచ్చు.విస్తృతార్థమున్న ఒక పదానికి పరిమితార్థ మేర్పడినప్పుడు దాన్ని అర్థ సంకోచం అని అంటారు.

**బాళిక** : క. బాళికె 'మన్నటం మన్నిక ఈ బట్ట బాగ బాళికవస్తుందా 'ఈ గుడ్డ బాగా మన్నిక వస్తుందా

**బీగుడు** : క. బీగు వియ్యంకుడు

**బీగులు/బీగురాలు** : క బీగలు వియ్యంకురాలు

**బైకులు** : క. బయకె వేవిళ్ళు గర్భిణి స్త్రీ వాంతులను బైకులు అంటారు.

**బుడం** : క. బుడ. చెట్టు మొదలు

**బేకు** : క. బేకు కావాలి. నాకదే బేకు నాకా వస్తువే కావాలి.

**బెళగు** : క. బెళగు. చక్కగా పనిచేతూ

**బెళ్ తింగళ్** : క.బెళ్‌తింగళ్. 'వెన్నెల' బెళ్ తింగళ్ కాసింది. వెన్నెలకాసింది. ఇక్కడ కన్నడలో వున్నదాన్ని యథా తథంగా వాడుకలోనికి తెచ్చుకున్నారు.

**బోగాణి** : క. బోగుణి. 'గిన్నె' పెద్ద గిన్నెను బోగాణి అని వ్యవహరిస్తారు.

**బరే** : క. బరే ఏమీ లేకుండా. బరే అన్నం వుంది. అన్నం మాత్రమే వుంది. కూరలేమీ లేవని తాత్పర్యం బరే బిత్తలు అని మరో వ్యవహారముంది. బరే బిత్తలు = bare body. బట్ట ఏమీలేకుండా వున్నాడని తాత్పర్యం.

**బిడువు** : క. బిడువు. 'తీరిక' నా కెప్పుడూ బిడువే లేదప్పా. 'నా కెప్పుడూ తీరికే లేదయ్యా'.

**బీగం** : క బీగ. 'తాళం' ఇక్కడ కన్నడ పదమైన-బీగ-కు తెలుగు ప్రత్యయం ము చేరి వ్యవహరింపబడుతుంది.

**మరవ** : క. మరిగె 'ముంత' మట్టితో చేసిన చిన్న ముంతను-మరవ అంటారు.

**మళె** : క. మళె. 'మేఘ'.

**మసి** : క. మసి. 'సిరా' ink. పెన్నులో మసి అయిపోయింది. 'పెన్నులో సిరా అయిపోయింది.'

**మళిగ** : క. మళిగె. 'అంగడి', A whare house.' బట్టల మళిగ. 'గుడ్డల అంగడి'

**మిరుగు** : క. మిరుగు. 'మెరుగు'. అగ్గిమిరుగు -'అగ్గి కణం'

**మించు** : క. మించు. 'మెరియు'. మోడాలు మించుతా వున్నాయి. 'మబ్బులు మెరుస్తూ వున్నాయి'.

**ముక్కు** : క. ముక్కు. 'వేగంగా తిను' లేదా ఒక రకమైన పద్ధతిలో తినడాన్ని-ముక్కు-అంటారు. ముక్కి ముక్కి తింటున్నాడు అని వ్యవహారం.

**ముగిసి** : క. ముగి. 'అయిపోవు'. అంతా ముగిసింది. 'అంతా అయిపోయింది. కావ్య భాష నేటికీ ఇక్కడి వ్యవహారంలో నిలిచి వుంది.

**ముసురు** ; క. ముసుర్. 'ఎంగిలి మెతుకులు' నీకు ముసురు కూడా చిక్కదు పోరా. 'నీకి ఎంగిలి మెతుకులు కూడా దొరకవు పోరా'.

**మెయ్/మయ్/పయ్** : క. మెయ్. 'శరీరం మెయ్ తిక్కమ్మా 'పీపు రుద్దమ్మా' (తిక్కు = రుద్దు

**మోడాలు** : క. మోడ 'మబ్బులు'

**యదార** : క. యదార 'ఆతురత' వాడుప్యాసయితే నాకేదార్లేదు (నాకు + యదార = నాకెదార)

**రెట్ట** : క. రట్టె 'భుజం' కన్నడలోని రట్టె వర్ణవ్యత్యయం జరిగి రెట్టగా మారింది. వానికి రెట్ట బలం బాగుంది. 'వానికి భుజబలం బాగుంది

**రాసి** : క. రాసి 'కుప్ప' కల్లము చేసినతర్వాత గింజలను రాసికెయ్యండి- అంటారు. అంటే 'గింజలన్నీ కుప్పచేయండి' అని భావం.

**లంగా** ; క. లంగా 'పావుడ'

**లోట** , క. లోట 'గ్లాసు'

**సంకటం/సంగటం** : క. సంకట 'నొప్పి, బాధ కడుపులో సంగటం సంగటం అయితుంది 'కడుపులో నొప్పిగావుంది.'

**సంబళం** : క. సంబళ 'జీతం'

**సాగుచేయు** : క. సాగువాళి 'సేద్యంచేయు ఈ భూమి ఇంతకుముందు సాగు చేసిందేనా? ఈ భూమి ఇంతకు ముందు సేద్యం చేసిందేనా!

**సాసూలు** : సాసువె 'ఆవాలు'

**సీళ్ళు** : క. సిళ్ళు. 'ఈల వేయడం' ఈలవేయడాన్ని ఇక్కడి ప్రాంతంవారు సీళ్ళు వేయడమంటారు.

**సుగ్గి** : క. సుగ్గి. 'పంట పండేకాలం'. చెనిక్కాయ సుగ్గి. 'వేరుశనక్కాయలు పండే season'.

**సుడుగాడు** : క. సుడుగాడు. 'శ్మశానం.'

**సుద్దులు** : క. సుద్ది. 'వార్తలు, మాటలు' సుద్దులు అంటే వార్తలు అనే అర్థంలో కూడా ఈ ప్రాంతంవారు వ్యవహరిస్తున్నారు.

వాళ్ళిద్దరూ సుద్దులు చేసుకుంటున్నారు. 'వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారు '

**సుళ్ళు** : క. సుళ్ళు. 'అపద్దం'. అపద్దం-కు బదులు సుళ్ళు అనే పదాన్నే ఇక్కడి వారు విపరీతంగా వ్యవహరిస్తారు.

**సూతకం** : క. సూతక. 'అంటు' ఎవరైనా చనిపోతే పెద్దకర్మ చేసేంతవరకు వాళ్ళింటికి-అంటు ఉంటుంది - అనడానికి బదులు - సూతకముంది అంటారు.

**సెక/శెక** : క. శెకె. ఉడుకు, ఉక్క పోయడం. గాలే లేదు శానా శెగపడుతుంది- అంటారు. ఈ వాక్యంలో శానా అన్నది కూడా కన్నడ పదమైన శానె నుంచి వచ్చింది. క. శానె = చాలా.

**సొత్తు** : క. సొత్తు. 'సొమ్ము' లేదా ఆభరణం.

**సోలు** : క. సోలు. 'ఓడిపోవు, అలసిపోవు' ఓడిపోవు-అర్థంలో : వాడు పందెంలో సోలి పోయినాడు. అలసిపోవు అర్థంలో వాడు పనిచేసి సోలి పోయినాడు.

**అటం** : క. హట. 'మొండికేయు' క. హ> తె. ం ఏమో యీ పొద్దు పిల్లోడు బలే అటం పట్టినాడు. 'ఏమో ఈ రోజు పిల్లవాడు బలే మొండి కేసినాడు,

**పిండు** : క. హిండు 'పితుకు' పాలు పితికినావా అనడానికి బదులుగా పాలు పిండినావా అని ఇక్కడి వ్యవహారం [హసప. హిండు - పిండి]

**అ త్తి** : క. హొ త్త 'కొలత తీసుకోవడం, Measurement' టైలర్‌కి అ త్తి ఇచ్చినావా- అని ఇక్కడి వ్యవహారం.

**పుడుకు** : హుడుకు 'వెదకు'

**పొద్దు** : క. హొత్తు 'రోజు, కాలం రోజు అర్థంలో ఈ పొద్దుయాటికి పోయింటివి ఈ రోజు ఎక్కడికి పోయి వుంటివి.

కాలం:- కానా పొద్దు పోయింది. యింక ఇంటికి పో 'చాలా సేపయింది యింక ఇంటికిపో.'

ఓళిగ ; క. హోళిగ 'భక్ష్యం'

కర్నాటక సరిహద్దుకు దగ్గరగా వుండే ఈ ప్రాంతాల్లో కన్నడ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది కన్నడనుంచి ఎరువు తీసుకునేటప్పుడు కొన్ని పదాలకు అర్థం పూర్తిగా మారిపోతుంది. కొన్నిపదాలకు కొద్దిగా మార్పు వస్తుంది. ఇంకాకొన్ని పదాలు అర్థసంకోచంగా గాని, అర్థవ్యాకోచంగా గాని పరిణామం చెందుతాయి. కొన్ని పదాలు కన్నడలో వున్నవి యథాతథంగా వాడబడుతున్నాయి. మరికొన్ని పదాలు సౌమ్యోక్తి కోసం వాడబడుతున్నాయి. చాలా పదాలను కన్నడలో వున్న అర్థంలోనే వ్యవహరించడం జరుగుతుంది. ఈ విధంగా ఈ ప్రాంతంలో కన్నడ ప్రభావం కల్గిన పదాలు వ్యవహారంలో విపరీతంగా వున్నాయి.

## రెఫరెన్సులు :


Upadhyaya, Susheela P. — 'Hindi-Kannada Common Vocabulary' Central Institute of Indian Languages, Mysure- Pub. (1973)

Kittle, F. — 'A Kannada-English Dictionary', Asian Educational Services, New Delhi-(1982)

బ్రహ్మానంద, హెచ్. ఎస్. — 'రాయలసీమ తెలుగు' స్రవంతి 30-3 (1983)

మోహన్, జి. ఎస్. — 'నిసటోయకుల మాండలికం—ఒక పరిశీలన' తెలుగు [త్రైమాసిక వైజ్ఞానిక మాసపత్రిక] జూలై -సెప్టె. (1981)

రెడ్డి, జి ఎన్. — 'అర్థ పరిణామం', భ. కృష్ణమూర్తి (సం) భాషాచరిత ఆం. ప్ర. సా. అ. ప్ర. (1979)

లక్ష్మినారాయణశర్మ, కుంటముకసుల. — 'నారాయణపేట మాండలికం-కొన్ని విశేషాలు', స్రవంతి 18-12 (1977)

హనుమంతప్ప, ఆదవాని. — 'తెలుగు మీద కన్నడభాషా ప్రభావం', భారతి 60-12 (1977)

'తెలుగుమీద కన్నడ భాషా ప్రభావం', స్రవంతి డిసె (1983).

# డా॥ రావూరి భరద్వాజ కథానిక సాహిత్యం

—జానగాని కొటమయ్య

రావూరివారి వంశంలో సంస్కారసంపద ఏమీ లోటులేదు. పాఠశాలలలోను, కళాశాలలలోను, చేరి చదుకోలేదు అన్నమాటేకాని, కొలతలకు అందని విద్యవిజ్ఞానులు, ఆ వంశీలందరికి ఉన్నాయి. రావూరిపుల్లయ్య ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులు, వారికుమారుడైన కోటయ్య ప్రాథమిక విద్యలోనే చదువు చాలించినను శాసనాలు సేకరించి, పరిశోధనలు చేయగలిగిన దాకా ఎదిగిన మనిషి.

కోటయ్యగారు మంచి గాయకులు కూడా. కొన్ని భజనబృందాలలో ఆయన సభ్యుడు. మరికొన్నింటికి ఆయనే నాయకత్వం వహించేవారు. నాటిక ప్రదర్శనలు మీద కోటయ్యకు మక్కువ ఎక్కువ. ఈ భూమిక ఆధారంగా ఆలోచించి నపుడు భరద్వాజ కథకుడు కావడం, కవి కావడం కేవలం యాదృచ్ఛికం కాదేమో అనిపిస్తుంది. భరద్వాజగారే అన్నట్లుగా కోటయ్యగారు అత్యద్భుతమైన కథలు చెపుతూ వుండేవారు. ఈ కథా గోష్ఠి సంవత్సరాల అవిచ్ఛిన్నంగా జరిగింది. శ్రోతలు ఎక్కువ సంఖ్యలోనే ఉండేవారు [1]

వెలగులూరి సుబ్బమ్మగారని, మా అమ్మగారు మహాద్భుతమైన కథలుచెప్పేది. పంద్రేండుమంది రాజకుమార్తెల కథలను ఆమె అరువైరోజులపాటు చెప్పింది. ఒక్కొక్కకథ అయిదురోజులు చెప్పాలట. ఆఖరి రోజున పంద్రేండు మంది రాజపుత్రికలు, వారి వారి ప్రియులతో సహ రాజధానికి తిరిగివస్తారు. మహారాజుగారు, మహారాణిగారు కళ్ళలో వొత్తులు పట్టుకొని ఎదురు చూస్తు వుంటారు. వారందరికి రంగంలో వైభవంగా పెళ్ళిళ్ళు అవుతాయి. కథకంచికి చేరుతుంది.[2]

తండ్రినుంచి అమ్మమ్మనుంచి వందలాదికథలు చిన్నతనంలోనే వినడం వలన, వాటిని మనసులోనే నెమరువేసుకుంటూ వుండడం వలన భరద్వాజకు మంచి ఉపకారం చేసింది. ఆ తరువాత ఆయన రచించిన చిన్న పిల్లల కథల్లోను, యితర కథల్లోను తను విన్న కథలునుంచి, కొంత సమాచారాన్ని ముడిసరుకుగా వాడుకొని వుండాలి. అలా వాడుకున్నానని డా॥ భరద్వాజ చెప్పారు.

"1944లో తన మొదటి కథ భరద్వాజ రాశాడు[3] అని కొండమూడి శ్రీ రామచంద్రమూర్తిగారు అంటున్నారు.

"నా మొదటికథ 1945లో అచ్చయింది."[4] అన్నారు భరద్వాజ. 1944-45వ సంవత్సరంలో 'ప్రజామిత్ర' వారపత్రికలో భరద్వాజ తొలిరచన ప్రచురింపబడింది." అని శ్రీ పోలవరపు శ్రీ హరిరావుగారు అంటారు. ఇవి సత్యాలుకావు. 'విపుల' అన్న 1944-45 లోనే రాసినప్పటికి, అది అచ్చయింది 1946 ఆగష్టు 25 తేదీనాటి 'ప్రజామిత్ర' సంచికలో ఆప్పటి నుండి ఇప్పటిదాకా వందలాది కథలను రాసినాడు, రాస్తునే ఉన్నాడు.

పుస్తకరూపంలో వచ్చినవికాక, పత్రికల్లో వుండిపోయినవి. పత్రికల్లో అచ్చు అయినవే కాక, ప్రసారమై ఆకాశవాణి ఫైళ్ళల్లో మిగిలి పోయినవి చాలా కథలున్నాయి. ఇవన్నీ ఉత్తమ కథలు విని విమర్శ

కులు అనడంలేదు, డా॥ భరద్వాజ అంతకన్నా అనడంలేదు. 1943లో వారు రాసిన కథ, శైలి పరిశీలిస్తే డా॥ భరద్వాజకు తెలుగు కావ్యాలతోనూ, ప్రబంధాలతోను, ఎంతటి గాఢమైన పరిచయం ఉన్నదో మనం సులభంగానే గుర్తించవచ్చు. కవిత్వ రచన భాషాడంబరం, శబ్దసంపద అవసరం కావచ్చునేమో కాని, వచనరచన, వాటి అవసరం అంతగా— లేదేమోనని విమర్శకుల అభిప్రాయం.

ఆ కారణంగానే కావచ్చు 1943 చివరిదశలో రాసిన "వీరగాధ" సరళగ్రాంధికంలో వుంది. అపుడే చలంగారి పుస్తకాలతో పరిచయం కలిగిందని భరద్వాజచెప్పుకొన్నాడు. "అలా పరిచయం కలిగించిన వ్యక్తి "జీవన్ ప్రభాత్"ి

1946వ సంవత్సరంలో అచ్చు అయిన "విమల" అన్నకథ రాసేనాటికి డా॥ భరద్వాజగారిమీద 'చలం' ప్రభావం దాదాపులేనట్లే లెక్క. "చలం"గారి సాహిత్యంతో 1943వ సంవత్సరంలో తనకు పరిచయం కలిగిందని డా॥ భరద్వాజ స్వయంగా చెప్పుకొన్నాడు. అచ్చుయైన తొలికథ 1946లో, ఈ నాలుగు సంవత్సరాల వ్యవధిలో "చలం" గారి పుస్తకాలు ఏవీ చదువ్వ లేదా ? చదివితే ఆయన రచనల ప్రభావం, భరద్వాజ మీద ఎందుకు ప్రసరించ లేదు. దీనికి డా॥ భరద్వాజ వ్యక్తిగత కారణాలు, సామాజిక పరిస్థితులు మనం వెదక వలసి వుంటుంది. "విమల" కథ అచ్చుయైన తరువాత, ఆతని కథా రచన వేగం పుంజుకుంది. ఆ రోజుల్లో కథలు వేసే పత్రికలన్నీ మద్రాస్ నుండి వెలువడుతూ వుండేవి. రాసిన కథలను రాసినట్టుగా ఆయా పత్రికలకు పంపడం, వారినుండి జవాబు సకాలంలో రాకపోవడం, కొన్ని కథలు ప్రచురితం కావడం, కొన్ని కథలు వెంటనే తిరిగిరావడం, మరి కొన్ని అతిగతి తేలక పోవడంలాంటి ఇబ్బందులన్నీ ఆయన అనుభవించినవాడే !

1947 నాటికి డా॥ భరద్వాజ నెల్లూరులో ఉద్యోగం చేస్తున్నాడు ఆ సంవత్సరం ఆగష్టు 15వ తేదీన "జ్యోతి" పక్ష పత్రిక మొదటి సంచిక మార్కెటులో వచ్చింది. ఆ తరువాత కొద్దిరోజులకే డా॥ భరద్వాజకథ "జ్యోతి" పత్రికలో వచ్చింది. ఆ కథకు "జ్యోతి" సంపాదకులు 5-00 రూ॥ పారితోషికంకూడా పంపించారు. "నేను మొట్టమొదటి సారిగా నా కథకు 5-00 రూ॥ పారితోషికం తీసుకొంటున్నపుడు నాకు ఆశ్చర్యం, ఆనందం కలిగాయి" అంటారు డా॥ భరద్వాజ.

ఇది జరిగిన కొద్దికాలానికి ఆయన "జ్యోతి"పత్రికలో ఉద్యోగంలో చేరడం, "చలం"గారితో వ్యక్తిగతంగా ఉన్న పరిచయాలు కారణంగానూ "జ్యోతి" పత్రికా నిర్వాహకులే "రేరాణి" అన్నపేరుతో మొట్టమొదటి "సెక్స్" మాసపత్రిక ప్రారంభించిన కారణంగానూ, డా॥ భరద్వాజ "సెక్స్ కథలు ఎక్కువగా రాశాడని విమర్శకుల అభిప్రాయం.

1950 నుండి 55దాకా 'సెక్స్' కథలు రాసిన, మధ్యలో యితర కథలు రాస్తూనే ఉండేవాడు. 'సమీక్ష' పత్రికలో 'త్రిపుర' అన్నకథ ఇందుకొక ఉదాహరణ 'చలం'గారి ప్రభావం నుండి బయట పడడంకోసం కొంతకాలంపాటు కథ రచనను పూర్తిగా విరమించాడు డా॥ భరద్వాజ. 'సెక్స్' కథా రచయితగా ముద్ర పడటం వలన యితర పత్రికలేవి ఆయన రచనలను ప్రచురించరానికి ముందుకు వచ్చేవికావు.

ఆ రోజుల్లో ఆంధ్రసచిత పత్రిక సంపాదక వర్గంలో సూర్యం పూడి సీతారావుగారు, నండూరి రామమోహన్‌గారు పనిచేస్తూ వుండేవారు. డా॥ భరద్వాజ రాసిన ఒకకథను ఆ ఉభయులు సాహసించి అచ్చు వేశారు. బందరునుండి వెలువడుతున్న 'తెలుగు విద్యార్థి' మాసపత్రికలో మరొక కథను, ఆ పత్రిక సంపాదకులైన కొల్లూరి కోటేశ్వరరావుగారు అచ్చు

వేశారు. 1954-55 సంవత్సరాల సాహిత్య పరంగా డా॥ భరద్వాజ అంతకుమించి ఏమికావు. అప్పటికి కొన్ని కథ సంపుటాలు వెలువడినప్పటికి, ఈ రెండు మూడు ఏళ్ళు ఆయన యితర వ్యాపకాలలో మునిగి పోయాడు.

1956లో మద్రాస్ చేరుకొన్నాక ధనికొండ హనుమంతరావుగారి పత్రికల్లో ప్రవేశించాక కథారచనలో తిరిగి విజృంభించాడు. మన ప్రాచీనసాహిత్యంలో ఉన్న ప్రచలితమైన కథలను, గాథలను, మూలాంశంగా స్వీకరించి పరమ రమణీయమైన కథలను ఆయన చాలా రచించాడు "కుమారసంభవం", స్వార్థపరులు "దక్షయజ్ఞం", "గిరిజా కళ్యాణం" వాటి కథలు పౌరాణిక పాత్రలతో పౌరాణికసన్నివేశాలన్నీ కూర్చి ఆధునిక సమస్యలను అందులో ఇమిడ్చి పఠితలకు అంద జేశాడు.

"వసుచరిత్ర", "మనుచరిత్ర", "దీక్షదుహిత" నోణకజాతు. అన్యథాశరణంనాస్తి వంటి కథలు ఒక ప్రత్యేక తరగతికి చెందినవి. తండ్రి ద్వారాను అమ్మమ్మ ద్వారాను తాను చిన్నతనంలో విన్న జానపదుల గాథలు తాలూకు ప్రభావం ఈ రచనల మీద వుండివుండాలి. కథారచయితగా డా॥ భరద్వాజ ఉన్నత శిఖరాగ్రాలధిరోహించిన కాలమిదే అని చెప్పవచ్చును.

ఈ కాలం లోనే జీవితానుభవాలు పెరిగాయి తెలుసుకొంటున్న సంఖ్య పెరిగింది. కష్టాలు సుఖాలు పెరిగాయి. గ్రంథపఠనం పెరిగింది. ఇవన్నీ కలసి ఆయన దృక్పథంలో మంచి మార్పులను తెచ్చి పెట్టాయి ఆ మార్పుల ఫలితంగా, సరికొత్త కథా వస్తువుతో సరికొత్త శిల్పంతో అనేక కథలను ఆయన పాఠకులకు అందజేశారు. పౌరాణిక పాత్రలను చారిత్రక పాత్రలను, ఉపనిషత్తు కథలను ఆలంబనం చేసుకొని, ఆధునిక కథారంగానికి అనుగుణంగా వాటిని అమర్చుకొని సరికొత్త కథకు శ్రీకారం చుట్టిన ఇద్దరు ముగ్గురు రచయితలలో భరద్వాజ ఒకరు.

జీవితం చాలా విచిత్రమైంది. జీవిత ప్రవాహాల ఏ అరణ్యాలనుంచి. రాతి భూములనుంచి, మైదానాల నుంచి, ఇసుక పొరలనుంచి ప్రవహిస్తుందో, ఊహించడం కష్టం. చేస్తూ, చేస్తూ ఉన్న ఉద్యోగాన్ని విడిచి పెట్టవలసిరావటం, తనకింత పరిచయంలేని కొత్త ఉద్యోగంలోకి విధిలేనిదశలో చేరవలసి రావడం, ఆర్థికమైన యిబ్బందులు, బంధువులెవ్వరూ సానుభూతి వాక్యాలనైనా చెవిన వేయకపోవడం, కలిసి డా॥ భరద్వాజ ఆలోచనా విధానాన్ని మరొక ప్రక్కకు మలించాయి. తన ఆర్థిక యిబ్బందులను తెచ్చుకోవడం కోసం, తనకిష్టం లేకపోయినప్పటికి, చెత్త, చెదారం చాలా రాయవలసివచ్చింది. అలా రాసినట్లు డా॥ భరద్వాజ నిస్సంకోచంగా చెప్పుకొన్నారు. డిటెక్టివ్ కథలు రాయడం వెనుక ఆర్థికలబ్ధ తప్ప మరొక ప్రయోజనం ఏమీలేదు. ఏమీలేదని పాఠకులకు తెలుసు.

1948కు ముందు పాఠ్యపుస్తకాలతో తప్ప, యితర పుస్తకాలతో డా॥ భరద్వాజ ఎటువంటి సంబంధం లేదు. ఆత్మాభిమానం ఆత్రంగా దెబ్బతిన్న, ఒకానొక శుభసమయాన, చదువుకోవాలన్న ఇచ్ఛ ఆయనలో ప్రబలింది. అప్పటినుండి తెలుగు పుస్తకాల పఠనమే తప్ప, ఆంగ్లసాహిత్యంతో ఎటువంటి పరిచయం ఆయనకులేదు.

1949నాటికి ఇంగ్లీషుతో వారికున్న పరిచయం, ఆ భాషలోని అక్షరాలు గుర్తించడం మాత్రమే. నిఘంటువులను దగ్గర పెట్టుకొని, ఒక్కొక్క అక్షరాన్ని కూడ బలుకుతూ, వాటికి అర్థాలు చూచుకొంటూ ఆయన ఆంగ్లభాషతో పరిచయం ఏర్పరచుకొన్నాడు. ఆ తరువాతనే విదేశీ రచయితల కథలను, నవలలను, సైన్స్ పుస్తకాలను డా॥ భరద్వాజ విరివిగా చదివాడు.

అయితే ఏ విదేశీ రచయిత ప్రభావం ఆయన మీద పడకుండ మొదటినుంచీ జాగ్రత్తపడ్డాడు.

ఇది ఎలా సాధ్యమైంది? తొలిదశలో "చలం" గారి ప్రభావానికి విశేషంగా లోనుకావడం, పత్రికలు ప్రజలుకూడ డా॥ భరద్వాజను "చలం" గారికి ఒక "రెప్లిక్" లాగా చిత్రీకరించారు. డా॥ భరద్వాజను తీవ్రంగా ఆలోచింపచేసి వుండాలి. గాయపరచి వుండాలి. ఒక్కసారి ఒక్క పొరపాటు పనిచేసి, ఆ పొరపాటుకు తగిన శిక్ష అనుభవించి, గుణపాఠం నేర్చుకొన్న తరువాత, ఇంకెపుడూ అటువంటి పని జరగకుండ జాగ్రత్తపడటం ఉత్తముల లక్షణం. పడవలసిన మాటలన్నీ, ముందుగానే పడటంవల్ల, అనుభవించవలసిన చిత్తక్షోభ అనుభవించడంవల్ల, వారు మేలుకో గలిగారు. దేశీయ విదేశీయ రచనలు ఎన్ని చదివిన వాటి సారాంశాన్ని అవగాహనం చేసికోవడమే తప్ప ఆవే అంశాలను అదే రీతిలో తిరిగి చెప్పడానికి ఎపుడూ ప్రయత్నించ లేదు. ఒక్క "సుగమ విజ్ఞాన శాస్త్ర అంధ" విషయాలలో తప్ప మిగిలిన డా॥ భరద్వాజ కథా రచనలు దేశయుత జాతీయుత కనిపిస్తాయేతప్ప ఎక్కడా విదేశీయుత విజాతీయుత కనిపించదు.

ఈ నేలలో జన్మించి ఈ గాలినే పీల్చి, ఈ ఎండకు వానకు తడిసి ఇక్కడే ఎదిగిన మనుషులే అతని కథల్లో కనిపిస్తారు. ఆయా పాత్రాల జీవితాలలోను సంభాషణలలోను ఆలోచనా విధానం లోను అసలైన సిసలైన తెలగు జీవితం, తెలుగు వాతావరణం కనిపించడానికి ఇదే కారణం.

డా॥ భరద్వాజ కథల్లోని పాత్రలను ఆ యా పాత్రల ఆధారంగా రచించిన కథలను, ముగింపు కిస్తూ శ్రీ తిరుమల రామచంద్రం గారు ఇలా అంటారు

"శ్రీ రావూరి భరద్వాజ పూర్తిగా ప్రజల మనిషి. రాజశేఖరుడు రచయితకు ఉండ వలసినవిగా చెప్పిన లోక స్మృతి పరిశీలనా ప్రతిభ వారిసొత్తు! చిన్న సంఘటన కన్న ఒకదృశ్యం విన్నవార్త వారి చేతుల్లో ఇతివృత్తాలై పోతాయి వారి పాత్రలలో, రకరకాల వృత్తుల వారున్నారు. రకరకాల ప్రవృత్తుల వారున్నారు. సచ్ఛీలురు, దుశ్శీలురు, భక్తులు, రిక్తులు భోగులు, త్యాగులు. కూలీలు, సోమరులు, పామరులు, అబద్ధాలకోర్లు, బడుద్ధాయిలు అను మాన ప్రాణులు పరధనాపహరణ ప్రాణులు ఇలా ఎందరో ఉన్నారు. ఈ పాత్రల చిన్నచిన్న అలవాట్లు కూడ భరద్వాజ గారి చూపుదాటిపోలేదు. వారు రాసిన మూడువందల పై చిలుకుకథలు (ఇపుడు ఆ సంఖ్య పెరిగివుండాలి) ఒకదాన్ని ఒకటి ఏకోణంలోను పోలవు. సృష్టించిన రెండువేల చిల్లర పాత్రలు ఒకదాన్ని మరొకటి ఎవుడూ అనుసరించవు, ఇంతటి వైవిధ్యం సాధించడంలో వారికివారేసాటి "

డా॥ భరద్వాజ 1982 నుండి వ్రాస్తున్న కథల్లో విషయం కొత్తది. ఆ విషయాన్ని అభివ్యక్తీకరిస్తున్న విధానం కొత్తది. ఆ వంతవాడే పేరు తేసిరుపంటి కథలు కొత్త వరవడికి నాందీవాచకం పలికాయి. ఆది భౌతిక పరమార్థాలను మానవాత్మను అన్వేషించడాన్నే కథాంశాలుగా చేసుకొని ఇపుడు కథలు వ్రాస్తున్నారు. "నాకాదేవుని చూడాలనిఉంది." "ఇల్లుఖాళీచేసి వెళ్ళి పోవాలి. "నావెంట ఎవరులేరు."నావెంటఎవరువారు." డా॥ భరద్వాజ ఆలోచనరీతి ఏవిధంగా విస్తారించి మనకు అవగతం చేస్తాయి.

"కథానాయకుడు దొరికాడు. ఇక కథరొంకాలి", అమె కథ-కాదు వాళ్ళ కథ, కాదు ఆ కిళ్ళ కథ "పేపసిజం" "ఈసారికిలా పోనంది", వంటి రచనలు ఒక ప్రత్యేక తరహాకు చెందినవి.

పరమార్థాలకోసం మానవాత్మపడే మూగ వేదనను అక్షరబద్ధంచేయడానికి వారిపుడు ప్రయత్నిస్తున్నారు. అనుభూతమైన, దివ్యానుభూతులను కథాకరించడానికి కృషిచేస్తున్నారు. "ఇల్లుఖాళీ చేసి వెళ్ళిపోవాలి. "నాకు దేవుని చూడాలని ఉంది."సశేషం" "నావెంట ఎవరు రారు." "నావెంట ఎవరూ లేరు" అన్నకథలు డా॥ భరద్వాజ ఆలోచనవిధానంలో వచ్చిన పరిణామాలను తెలియజేసాయి.

"కథానాయకుడు దొరికాడు ఇక కథ దొరకాలి" "ఆమెకథ కాదు- కాదు కళ్ళకథ కాదుకాదు"అకళ్ళకథ పేదనిజం,"ఈసారికిలాపోనీండి""ఈదేశం నాదికాదు" వంటికథలు నభూతో అనవచ్చు. కథా రచనలు తనదైన ఒక ప్రత్యేకముద్రను, శైలినీ సంతరించుకొన్న రావూరి భరద్వాజ, తెలుగు కథాసాహిత్య చరిత్రలో సుప్రతిష్ఠులయినారు.

తెలుగు పరిశోధన విద్యార్థి,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం— 515

## ఈ వ్యాసానికి ఉపయోగపడిన ఆధారగ్రంథాలు, పత్రికలు

1. డా॥ రావూరి భరద్వాజ- వీరగాథ- నాటికి- నేడు అన్న శీర్షిక- ముద్రణ 1978- బాలాజీ గ్రంథమాల 457- హైదరాబాదు.
2. డా॥ రావూరి భరద్వాజ- కంచికి వెళ్ళినకథ- 1967- బాలాజీగ్రంథమాల హైదరాబాద్- 457
3. కొండముది శ్రీరామచంద్రమూర్తి- రచనా రహస్యమెరిగిన- రావూరి భరద్వాజ- ఆంధ్రజ్యోతి దినపత్రిక అగష్టు 23, 1982
4 డా॥రావూరి భరద్వాజ కథలెలా రాస్తారు.1975, పేజి- 51
5 శ్రీ పోలవరపు శ్రీహరిరావు- జనత తెలుగుదినపత్రిక- జీవనసమరంలో కళాప్రపూర్ణుడు.
6. రావూరి భరద్వాజ- వీరగాథ- నాటికి-నేడు శీర్షిక 1978
7. శ్రీ తిరుమల రామచంద్ర- కథలురాయడం ఎలా- పీఠిక- 1963- vi-vii

# స్నిగ్ధ కవితా తపస్వి – శ్రీ 'తిలక్'

—ధూర్జటి వెంకట బాలాజి

"కవిత్వం ఒక ఆల్కెమీ
దానిరహస్యం కవికేతెలుసు
కాళిదాసుకుతెలుసు: పెద్దన్నకుతెలుసు
కృష్ణశాస్త్రికితెలుసు: శ్రీశ్రీకి తెలుసు

అని 'నవత- కవిత' అనే ఖండికలో బాలగంగాధర తిలక్‌గారు అన్నమాటలివి.

ఆధునిక కవితా ప్రపంచంలో వ్రాసిన కవితలు గ్రంథరూపాన్ని నోచుకోకముందే వెలుగులోకి వచ్చి పలువురు సాహితీ ప్రియంభావుకుల చేత మన్ననను పొందిన కవులలో శ్రీశ్రీ ఆరుద్ర(?) జంతాల తర్వాత దేవరకొండ బాలగంగాధరతిలక్‌గారు వస్తారు. ఆయన మనోజ్ఞసృష్టే 'అమృతం కురిసిన రాత్రి' కావ్యం.

పూచినప్రతిపువ్వూ వికసించదు.
వికసించిన ప్రతిపువ్వూ పరిమళించదు.
పరిమళం కలిగిన ప్రతిపువ్వూ లోకంలో రాణించదు.

ఆదేవిధంగా కవిత్వం రాసిన ప్రతివాడూ గొప్ప కవి కాజాలడు. ప్రతిభావంతుడైన ప్రతి కవికీ అర్హత, అర్హ్రతలుండాలి వీటితో పాటుప్రతిభాసామర్థ్యాలుండాలి. తనదంటూ చెప్పగలిగిన ఒకశైలి ఉండాలి. ఈ లక్షణాలు ఏ కవిలో ఉంటాయో అతడే రాణించగలడు. దేవరకొండ బాలగంగాధరతిలక్ గారికి అటువంటి లక్షణాలు ఉన్నాయి. కాబట్టి అతడు గొప్ప కవిగా రాణించ గలిగాడని మనం విశ్వసిద్దాం!

బాలగంగాధరతిలక్ కేవలం గొప్ప కవే కాదు. ఉత్తమ కథకుడు. అత్యుత్తమ నాటకరచయితకూడా. కానీ ఆయన అన్నీ ప్రక్రియలకంటే కవిత్వంవ్రాసిన గొప్పకవిగానే మెఱిలారు. 'తిలక్' అంటే మనకు మొట్టమొదట గుర్తుకొచ్చేది ఆయన ఏకైకకావ్యం 'అమృతం కురిసిన రాత్రి'. ఇందులో అన్నివర్గాలకు చెందిన కవితలున్నాయి. మధురమైన కవితలు, అనుభూతిపరమైన కవితలు మానవత్వాన్ని ప్రబోధించే కవితలు, సమాజాభ్యుదయాన్ని రేలెత్తించే కవితలు, విషాదకవితలు, వినోదకవితలు ఇంకా ఎన్నో... ఎన్నెన్నో... మరింకెన్నో... కానీ ఆ కవితల్ని చదివినప్పుడు ఆయా కవితలలో మనకు అంతర్లీనంగా కనిపించే సూత్రమొక్కటే...అదేఅతనిమానవతాదృక్పథం ప్రధానంగా 'తిలక్' మానవతావాది. మానవత్వాన్ని తనరచనలో ప్రతిబింబించడమే ఆయనప్రధానలక్ష్యం. రచనోద్దేశం. అందులకు ప్రాచీన అర్వాచీన సాహిత్యాలలోనే కాక ఆంగ్లసాహిత్యాన్ని క్షుణ్ణంగా మధించి ఆ సారంతో తనవిలువైన మేధను ప్రతిభాసామర్థ్యాలను జోడించి కవిగా ఆయన్ను మహోన్నతశిఖరాలను దర్శింపజేసే కవితల్ని రాశారు .

'అమృతం కురిసిన రాత్రి'కావ్యంలో ఆయన కవిగా తన కవితాతత్త్వాన్ని చాటిచెప్పే కవితలను రాశారు. దానిపేరు 'నా కవిత్వం'. అందులో కవిత్వాన్ని ఈ విధంగా విశ్లేషిస్తారు.

'నా కవిత్వం కాదొక తత్త్వం
మరికాదు మీరనే మనస్తత్వం
కాదు ధనికవాదం, సామ్యవాదం—
కాదయ్యా అయోమయం, జరాభయం—

నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే
దయా పారవతాలు

నా అక్షరాలు ప్రజాశక్తుల్ని వహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకొనే అందమైన ఆడపిల్లలు

-ఇక్కడ తన కవిత్వాన్ని పలుకోణాలనుండి దర్శించి ఒక స్పష్టమైన అవగాహనతో మనకు చెప్పారు. మానవుడు అనుభూతవాది. అనుభూతి లేక పోతే జీవితంలేదు. ఎందుకంటే అనుభూతిలోనుండి రసానందం జనింపదు. రసానందజనకం కానిది కవిత్వం కానేరదని విమర్శకుల అభిప్రాయం. 'ఇక కాదు ధనికవాదం, సామ్యవాదం' అన్న మాట లలో కవి సిద్ధాంతానికి కట్టుబడి రాసే కవి కాదన్న విషయం స్పష్టంగా సువిదిత మౌతుంది. ఈ కావ్యం లోనే మరొకచోట ఆయనే ఒక కవితలో 'ఇజమ్ అనే ఇంప్రిజన్‌లో ప్రవేశిస్తే ఇంగితజ్ఞానం నశిస్తుంది.' అని పలుకుతారు ఆయన కవిగా ఎంత స్వచ్ఛమైన వాడో, మనకు బోధపడుతుంది.

అనుభూతివాదిగా, గొప్పమధురమైన ఊహల్ని గావించిన మహోన్నతునిగా, 'అమృతం కురిసిన రాత్రి' ఖండికద్వారా నిలిచిపోయాడు. ఆ ఖండికలో ఒకచోట ఈ విధంగా పలుకుతాడు.

'అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్రపోతున్నారు
నేను మాత్రం
తలుపు తెరచి యిల్లువిడిచి
ఎక్కడికో దూరంగా
కొండదాటి
కోనదాటి
వెన్నెల మైదానంలోకి
వెళ్ళి నిలుచున్నాను"

-ఇందులోని భావుకత ఏపాటిది ? కవి తనను గురించి తాను విశ్లేషించు కొంటున్నాడు. నిజమే ! కొండదాటి, కోనదాటి ఎక్కడికి వెళ్ళాడు ? వెళ్ళి ఏం చేసాడు ? ఒంటరిగా వెళ్ళి మైదానంలో ఒక్కడే నిలుచున్నాడు. అంటే అందమైన ప్రకృతిలోని సౌంద ర్యాన్ని ఆస్వాదించడానికి వెళ్ళాడని మనం భావించు కోవాలి. మరి వెళ్ళినవాడు అప్సరసలు పోయగా అమృతాన్ని సేవించివచ్చాడు.

జలజలమని కురిసింది వాన
జాల్వారింది అమృతంపుసోన
దోసిళ్ళతో తాగి తిరిగివచ్చాను
దుఃఖాన్నీ చావునీ వెళ్ళిపొమ్మన్నాను
కాంక్షామధుర కాశ్మీరాంబరం కప్పుకొన్నాను.
జీవితాన్ని హసన్మందారమాలగా ధరించాను.
జైత్రయాత్రాపథంలో తొలి అడుగుపెట్టాను.

-అమృతం త్రాగడం లేక సేవించడం అంత సులభంకాదు. అమృతం సేవించగలిగిన యోగ్యత అర్హతలు ఒక్క దేవతలకే ఉన్నాయి. అందువలన వాళ్ళని అమరులన్నా మనకు అభ్యంతరంలేదు. కానీ ఒక సామాన్యుడైన కవి, ఒక అజ్ఞాతమైన ప్రాంతా నికివెళ్ళి అమృతాన్ని సేవించడమనేది చిత్రంగాలేదూ! ఇటువంటి ఊహ ఒక్క కవి ప్రతిభావంతుడైనవాడే చేయగలడు. అందువల్లనే తిలక్ అటువంటి అనుభూ తిని కవితలో నింపగలిగాడు. అందులో చిట్ట చివరగా-

"అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్రపోతున్నారు
అలసి నిత్యజీవితంలో సుషుప్తిని పొందాను
అలవాటునీ, అస్వతంత్రత కావలించు కున్నారు.
అధైర్యంలో తమలోతాము ముడుచుకుని పోయిపడుకొన్నారు.
అనంత చైతన్యోత్సవాహ్వానాన్ని వినిపించు కోలేక పోయారు
అందుకే పాపం !
ఈ నాటికీ తెలియదు
నేను అమరుడనని"

అంటాడు. నిజమే ! కేవలం అమృతం త్రాగినందువల్ల అమరుడు కాలేడు కవి ! జరామరణాలకు అతీతమైన కవితను రాసి లోకంలో గొప్పకవిగా నిలిచి పోయాడు మన తిలక్. కానీ చిత్రం ! ఈ విషయం ఎవరికీ తెలియదు !' అని పలకడంలో ఒక విశేషం లేకపోలేదు. తానే అమృతం త్రాగినందువల్ల, అమరుడయ్యానని అందరితో చెప్పుకొన్నాడు. ఈ విధంగా అమృతం త్రాగినందువలన అమరుడు కాలేదు. గొప్ప కవితను రాసి నలుగురు మెచ్చదగిన స్థాయిలో అమరుడయ్యాడని చెప్పొచ్చు.

'అమృతం కురిసిన రాత్రి' కావ్యం ద్వారా కవి తిలకుడు బాలగంగాధరుడు ప్రవచించిన మరొక సందేశం మానవతావాదం, మానవత్వం, మంచితనం- ఈ రెండింటికన్నా మించిన సంపదలు సృష్టిలో మరొకటి లేవు. ఈ రెండుగుణాలు తుట్టతుదకు విశ్వమానవ సౌభ్రాత్రానికి దారితీస్తాయి. అందులకు నిదర్శనంగా వసుధైకగీతం అనే ఖండికలో విశ్వమానవతత్త్వానికి ప్రతీకలుగా పేర్కొన్న కొన్ని వాక్యాలను ఇక్కడ ఉదాహరిద్దాం. "సంకుచితమైన జాతిమతాలు సరిహద్దులను చెరిపివేస్తున్నాను నేడు, అకుంఠితమైన మానవీయ పతాకను ఎగురవేస్తున్నాను చూడు. చరిత్రల రక్త జలధికి స్నేహసేతువును నిర్మిస్తున్నానురండి కవివచస్పవిత్ర కాంతపూరమిది స్వేచ్ఛగా జలకమాడండి".

ఇక్కడ సంకుచితమైన జాతిమతాల సరిహద్దులను చెరిపివేయడంలోను అకుంఠితమైన మానవీయపతాకాన్ని ఎగురవేయడంలోను గొప్ప విశ్వమానవ దృక్పథముంది. నిజానికి మానవత్వమనేది కులానికి మతానికి అతీతమైనది కదా ! అటువంటి అత్యున్నతమైన మానవత్వం నేటి మానవ ప్రపంచానికి అవసరం మరి! అందులకే చరిత్రల రక్తజలధికి స్నేహసేతువును నిర్మిస్తున్నాడు కవి తిలక్. అందులోనే మరొక చోట తన విలువైన మానవతా వాదానికి ప్రతీకలుగా కొన్నిమాటలంటాడు కవి.

"ఎంత కన్నీరు మున్నీరుగా కురిశాను
మీ కోసమై
ఎంత మిన్నేరు పన్నీరుగా దింపాను
మీ కోసమై
వర్తమానం నేడు సుందరాభి సారికవోలె
నిలిచి హేలగా
ఆగామి కాల గంభీరస్వామి కంఠాన వేయ
బోయే మాలగా
నిలిచిందినేను, పిలిచిందినేను, దశదిశల
కలిపిందినేను"

ఏ మానవుడైన తనశక్తికొలది విశ్వమానవ సౌభ్రాత్రానికి కృషిచేయాలిమరి! అలా చేయగలిగినప్పుడే అతడు ఈ లోకంలో బ్రతకగలుగుతాడు. అలా బ్రతక గలిగినవాడే లోకంలో రాణిస్తాడని కవి విశ్వాసం !

ఇక మనిషికి విశ్వమానవ సౌభ్రాత్రమే కాదు. దేశాన్ని కాపాడగలిగిన ఒక శక్తి, దేశాన్ని ప్రేమించ గలిగిన ఒక ఔదార్యం. దేశంకొరకు ప్రాణాలర్పించ గలిగిన ఒక తెగింపు ఒక సాహసం. ఒక చొరవ ఉండాలి. దేశానికి ప్రాణాలను సైతం అర్పించగలిగిన ఒక సైనికుడు, అనుక్షణం తన లక్ష్యాన్ని నెరవేర్చుకోడానికి ప్రయత్నిస్తాడు ! తప్పదు. ఆ లక్ష్యంతో అతడు కృతార్థుడైతే సంతోషిస్తాడు. విఫలుడైతే దుఃఖిస్తాడు. నిరాశను పొందుతాడు. కానీ అతనికి ఆ నిరాశ సంతోషాన్ని ప్రసాదించదు. అందులకే 'సైనికుడికి ఉత్తరం' అనే ఖండికలో ఇలా అంటారాయన.

"కనిపించే ఈ యూనిఫారం క్రింద
ఒక పెద్దనిరాశ, ఒక అనాగరికత
బ్రిడ్జి క్రింద నదిలాగ రహస్యంగా ఉంది
వదలలేని మోసపు ఊబిలాగా ఉంది.
నేనంటే నాకే అసహ్యం
అందుకే మరీ మరీ చంపుతాను. మరీ మరీ
త్రాగుతాను
ఇంకేంచేసినా ఎవరూ ఒప్పుకోరు

నిజమే ! సైనికుడు నిరంతరం దేశంకొరకు శ్రమించడంలో ఒక తృప్తిని, ఒక ఆనందాన్ని పొందుతాడు. అతడు చేసిన శ్రమకు తగిన ఫలితాన్ని పొందినవుడు ఆనందిస్తాడు. లేకపోతే తగినంతగా దుఃఖాన్ని అనుభవిస్తాడు. తప్పదుమరి ! దానివలన ఒక నిరాశ ఒక అనాగరికత కలుగుతాయి. ఆ నిరాశ బ్రిడ్జిక్రింద నదిలాగా రహస్యంగా ఉంటుంది. 'నేనంటే నాకే అసహ్యం' అని పలకడంలో కవికి గల ఆత్మ విమర్శ ఏ పాటిదో మనకు విదిత మౌతుంది. అయితే మనిషికి ఉండేలోపాన్ని కప్పి పుచ్చుకోడానికి తగినంత త్రాగితే చంపితే, అది మనిషిలోని బలహీనతను తెలియచేస్తుంది. ఇంకేం చేసినా ఎవరూ ఒప్పుకోరు'. అనడంలో ఏమీపట్టని తన వ్యక్తిత్వం ఏమిటో ఇక్కడ కవి సైనికుని ద్వారా తెలియచేస్తున్నాడు. నిజమే ! ఏమీ పట్టించు కోకపోతేనే స్వచ్ఛమైన హృదయంతో గొప్పగా రాయ గలుగుతాడు. లేకపోతే పేలవంగా తయారౌతుంది

'అమృతం కురిసిన రాత్రి' కావ్యంలో చెప్పుకొన దగిన గొప్ప ఖండిక 'నవత-కవిత. అందులో ఆయన తనరచనోద్దేశాన్ని గురించి స్పష్టంగా వివరించాడు ఏ కవికైనా కవితావిషయకంగా ఒక లక్ష్యముంటుంది. విశ్వశ్రేయస్సుగాని, సామాజిక చింతనగాని, సామాజిక దృక్పథంగాని,- ఏదోఒకలక్ష్యం అంతర్లీనంగా, అతని కవితలో ప్రవహిస్తుంటుంది. అందులో ఒకచోట ఆయన-

"ప్రతిమాటకు శక్తివుంది, పదునువుంది
ప్రతిచిత్రణకి అర్థం వుంది' ఔచిత్యంవుంది
గులకరాళ్ళశబ్దాప్రయోగించి గొప్ప సంగీతం
అని దబాయించకు
అలిగినన్ను శపించకు! అన్నా ! నీమీద నాకు
కోపంలేదు !

అంటారు ఏదో చెత్తరాసి దాన్ని కవిత్వమనమంటే ఎవరంటారు చెప్పండి? మాటలుపేర్చడమో, లేక గొప్ప మాటలు కూర్చడమో కవిత్వమైతే ఇక కవిత్వా నికి లక్ష్యంగాని, నిర్దుష్టమైన దృక్పథంగానీ ఉండవు కదా? అందులకే ఆయన ప్రతిచిత్రణకూ ఒకఅర్థం ఒక ఔచిత్యం ఉండాలని వాదిస్తున్నారు. ఆ వాదాన్ని ప్రతిపాదిస్తూ ఆ ఖండికలోనే మరొకచోట కవిత్వం యొక్క పరమావధిని గురించి విశ్లేషిస్తూ ఆయన-

"ఈ కాలంలో బ్రతుకు" యీప్రపంచాన్నిప్రతి
ఫలించు
ఇంటికున్న కిటికీలన్నీ తెరచి అన్నిపవనాల్ని
ఆహ్వానించు
నువ్వుచెప్పేదేదైన నీదైవుండాలి- నీలోంచి
రావాలి- చించుకొని రావాలి
మాటలుపేర్చటం కవితకాదు, మంత్రతంత్రం
అసలేకాదు
మళ్ళీ యీనాడు చిత్రకవితల్ని (బంధ) అయో
మయ బంధాల్ని పునరుద్ధరించకు
నిగ్రహప్రగ్రహాలులేని భావాశ్వాలని బరిమీద
వదలకు
అన్నా!కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని
బహిర్గతం చేయాలి విస్తరించాలి చైతన్యపరిధి
అగ్నిజల్లినా అమృతం కురిసినా
అందం, ఆనందం దాని పరమావధి"

-అంటారు. ఇక్కడచివర మాటల్ని గమనించండి. అగ్నిజల్లినా, అమృతం కురిసినా దానిధ్యేయం మటుకు ఆనందాన్ని ప్రసాదించడంవరకు మాత్రమే భారతీయ లాక్షణికులు, అంటే ప్రాచ్యలాక్షణికులు. ఇక పాశ్చాత్యలాక్షణికులునూ, వీళ్ళందరూ కూడా కవిత్వంయొక్క పరమావధి ఆనందమేనని చెప్పారు. దాన్నే శ్రీ "తిలక్" ప్రస్తుత ఖండికలో స్పష్టంగా విశదంచేసారు. ఇది ఆయన వ్యక్తిగతమైన అభిప్రా యంగా పేర్కొనవచ్చును.

ఇక కావ్యంలో గమనించవలసిన అంశం మరొకటి ఉంది. అది సర్వమానవ సమానత్వం. అంతగొప్ప ఔదార్యం ఈ విశాల మానవప్రపంచంలో కొద్ది

మందికే ఉంటుంది. అటువంటి మహోన్నతమైన మానవత్వాన్ని గురించే కవి శ్రీ తిలక్ గారు స్పష్టం చేసారు. సమాజంలో ధనిక పేదవర్గానికి ఎప్పుడూ సంఘర్షణ జరుగుతునే ఉంటుంది అధికులకూ, అల్పులకూ జరిగే నిత్యం దైనందిన పోరాటంలో అల్పుడు ఏవిధంగా అణచబడతాడో ఒక పోష్టుమన్‌ను ఆలంబన వస్తువుగా స్వీకరించి వ్రాసిన ఖండిక 'పోష్టుమన్'లో తన ఆవేదనను వ్యక్తంచేసారుకవి-

"అందమైన అమ్మాయి మీదకాని
చందమామ మీదకాని
వంద్యుడైన భగవంతుడి మీదకాని అ
వంద్యుడైన ధీరనాయకుడు మీదకాని
పద్యాలల్లమని మనపూర్వులు శాసిస్తే
ఎక్కడ పోష్టుమనో యీ గోల
ఈ సాయంత్రం వేళ.......

అంటారు. నిజమే ! ఒక సామాన్యుడైన పోష్టుమన్‌ను కేంద్రంగా తీసుకొని ఎవరు కవిత్వం రాస్తారు చెప్పండి ? చందమామ మీద కాని అందమైన అమ్మాయి మీదకాని కవిత్వం రాయడం సరే సరి ! కానీ ! ఒక సాయంత్రం వేళ కేవలం ఒక సామాన్యుడైన పోష్టుమన్ మీదరాయడం ఒక విశేషం కదా ! కట్టమంచి రామలింగారెడ్డి 'ముసలమ్మ, అనే ఒక కన్యకను కేంద్రంగా తీసుకొని 'ముసలమ్మ మరణం, అనే కావ్యం రాశాడు. గొప్పఉదాత్తమైన కావ్యమది. అలాగే పోష్టుమన్‌ను కేంద్రంగా తీసుకొని 'తపాలా బంట్రోతు' అనే ఖండిక రాసి అతనిపట్ల అంటే సుబ్బారావుపట్ల ఇంకాచెప్పాలంటే తనస్నేహితునిపట్ల గల స్నేహానురాగాలను వెల్లడించుకొన్నారు.. ఖండికలో చిట్టచివరగా ఆయన-

"ఒక్కనయనం నీ కోటుదాటి లోపలికి
చూడదు
ఉత్తరం యిచ్చి నిర్లిప్తుడుగా వెళ్ళి పోయే
నిన్ను చూసినపుడు
తీరంవదలి సముద్రంలోకి పోతున్న ఏకాకి
నౌకచప్పుడు"గానే ఉంటుంది.

అని పలుకుతారు. నిజమే అంతటి నిర్లిప్తుడు అతను. పోష్టుమన్ కొరకు ఎంతమంది పరితపిస్తుంటారు? అందరికీ ఉత్తరాలిచ్చి సంతోషాన్ని కూర్చి చివరకు అందరిదగ్గరగా శెలవుతీసుకొని వెళ్ళిపోయే అతన్ని చూచినపుడు, తీరంవదలి సముద్రలోకి పోతున్న ఏకాకినౌక చప్పుడుగానే ఉంటుంది.

'అమృతంకురిసినరాత్రి' కావ్యంలో చెప్పుకొనదగిన కవిత 'నీవులేవు- నీ పాటవుంది. అందరూ చెప్పుకోదగిన గొప్పకవితఇది. దానిని గురించి విశ్లేషిస్తూకవి-

"నువ్వులేవు- నీపాటవుంది: ఇంటిముందు
జూకామల్లె తీగల్లో అల్లుకొని
లాంతరు సన్నని వెలుతురులో క్రమ్ముకొని
నా గుండెల్లో చుట్టుకొని
గాలిలో ఆకాశం నక్షత్రం చివరి మెరుపులో
దాక్కొని నీరవంగా
నిజంగావుంది. జాలిగా హాయిగా వినబడుతు
వుంది శిశిరవసంతాల
మధ్యవచ్చే విచిత్రమైన మధురమైన మార్పుని
గుర్తుకు తెస్తోంది యిన్నేళ్ళతర్వాత వేడిగాలి
చల్లదనానికి తిరిగే ఒక గ్రీష్మ దివసాన
సమయాన డాబామీద
.......................................
క్రమ్ముకొని నా గుండెల్లో చుట్టుకొని గాలిలో
ఆకాశంలో
నక్షత్రం చివరిమెరుపులో దాక్కొని నీరవంగా
నిజంగావుంది."
జాలిగా హాయిగా వినబడుతూవుంది
శిశిరవసంతాల మధ్య వచ్చే విచిత్రమైన
మధురమైన మార్పుని
గుర్తుకు తెస్తోంది యిన్నేళ్ళ తర్వాత"

అంటారు. అనుభూతికి పరమావధి ఈ కవిత. ఈ ఒక్క ఖండిక చాలు ఆయన అనుభూతివాది

అని చెప్పడానికి ! నీవులేవు-'నీ పాట వుంది' అని పేరును ఈ కవితకు పెట్టడంలో ఒక ఔచిత్యముంది. ఒకనాటి ప్రియురాలిని. గుర్తుకు తెచ్చుకొంటూ, ఆమె స్మృతులను నెమరువేసుకొంటూ వాటికి కవితరూప మిచ్చారు శ్రీ తిలక్ గారు. మనిషి జీవించినంతకాలం మనిషి విలువ గుర్తించడం జరగదు. కానీ మనిషి తెరమరుగున పడ్డప్పుడే అతని స్మృతులు ఎప్పుడూ వెన్నంటుతూ ఉంటాయి. మనిషి విలువ చాలా ఉన్నత మైనది కనుక దానివిలువను మిగిలినవానితో పోల్చ కూడదు.

ఇరవయ్యోశతాబ్ది ఆధునిక కవితా ప్రపంచంలో జనించిన చిత్రవిచిత్రాలైన మార్పులను పరిశీలిస్తూ వాటికి అనుగుణంగా కవితలను వ్రాయడమనేది ఒక గొప్ప సాహసోపేతమైనకార్యం. ఆ కార్యాన్ని నెర వేర్చి అందులో విజయాన్ని సంపాదించి కవితా రంగంలో తనదంటూ ఒక సుస్థిరమైన మార్గాన్ని నిర్మించుకొన్నారు. మహాకవి శ్రీశ్రీమాటల్లో చెప్పా లంటే 'అనితరసాధ్యం-నామార్గం' అనే విషయాన్ని శ్రీ తిలక్ కూడా అన్వయించవచ్చు.

దేవరకొండ బాలగంగాధర తిలక్ గారు మిగిలిన ప్రక్రియలను చేపట్టి మేలిమి పంటల్ని పండించినా, ఆయన భూమిక కవిత్వమే ! 'ఏఇజాలకు, ఉద్యమా లకూ లొంగకుండా తనదంటూ ఏర్పరచుకొన్న ఒక నిర్దుష్టమైన మార్గంలో పయనించి గొప్ప కావ్యాన్ని వెలయించిన స్వచ్ఛమైనకవి శ్రీ తిలక్.

జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నా స్తితేషాం యశఃకామే జరామరణజంభయమ్

డో/నెం- 10-38-8బి
టీచర్లకాలనీ,
జనతాపేట ఫస్ట్ లైన్
కావలి-524 202
నెల్లూరు (జిల్లా) ఆంధ్రప్రదేశ్

# సాహిత్యగోష్ఠి

## విద్యుద్ఘాతం వేమన కవిత్వం

సంప్రదాయమెప్పుడూ అభిలషణీయమే. అది తరతరాల జాతి ఉత్తమ విలువలను సూచిస్తుంది. కానీ కొన్ని సంప్రదాయాలు నిర్జీవమై, నిరుపయోగమై కేవలం బాహ్యాడంబరంతో జాతి జీవఝరికి అడ్డు కట్టలు వేస్తాయి. సంఘంలోని అటువంటి దురాచారాలనూ, దురాగతాలను ఎదుర్కొని ఖండించాలంటే అందుకు తగ్గ గుండె నిబ్బరం, మనోబలం వుండాలి. దుస్సంప్రదాయాల కబంధ హస్తాలలో నలిగిపోయే ప్రజలను నూతన దృక్పథంలోకి మళ్లించి విజ్ఞానవంతులను చేయాలంటే అందుకు తగిన క్రాంతదృష్టి కార్యదీక్ష, సమ్యగాలోచన ఎంతో అవసరం. ఇవి అన్నీ వున్న వ్యక్తులు చాలా అరుదు. వారే సంఘాన్ని అభ్యుదయ పథంలోకి మళ్ళిస్తారు. అటువంటివారిలో వేమన మొట్ట మొదట చెప్పదగినవాడు. విద్యుద్ఘాతం వంటి తన కవితా ధారతో సంప్రదాయాల ఇనుపగోడలను పగలగొట్టాడు. మాటలో కరుకుదనం, భావంలో నిశిత దృష్టి వున్నవాడు. నిర్మొహమాటమతని స్వభావం. ధైర్యమతని వూపిరి. తనకు తోచిన దానిని నిష్కర్షగా చెప్పే జంకూ, గొంకూ లేనివాడు. ధనుర్ముక్తనారాచమన్నా గురితప్పుతుందేమో గానీ, ఆయన కవితా ప్రయోగం మాత్రం గురితప్పదు. బండబారిన హృదయపు పొరలనైనా అవలీలగా ఛేదించుకొని పోతుంది.

ప్రజల భాషలో ప్రజలను గురించి ప్రజలకోసం కవిత చెప్పిన ప్రజాకవి వేమన. అర్థగాంభీర్యానికి శబ్దాడంబరం అక్కరలేదని నిరూపించిన కవి వేమన. భావాంబర వీధులలో విహరించే తెలుగు సరస్వతిని పల్లెసీమలలో, పిల్లగాలులలో సయ్యాటలాడించాడు. నిత్యవ్యావహారిక భాషలో నిస్తుల భావసంపదను పండించవచ్చునని నిరూపించాడు. తెలుగు నుడికారానికి పట్టం కట్టాడు. ఆయన నుడులు నానుడులై జాతి జనుల నాల్కలపై నర్తిస్తున్నాయి.

వేమన ఆటవెలదిని తన కవితా సాధనంగా చేసుకొన్నాడు. అంతకుముందు లేనిహొయలు, సయ్యాటలు ఆటవెలదికి నేర్పి తెలుగు కవితా రంగస్థలంపై నాట్యం చేయించాడు.

ప్రజలు అభ్యుదయ పథంలో పయనించాలని, దురాచారాలను వదలి వేయాలని వేమన ప్రబోధించాడు. నాడు సమాజంలో నిరుపయోగమైన ప్రతి సంప్రదాయాన్నీ, అసిధార వంటి తన కవితాధారతో చీల్చిచెండాడు.

"పిండమును జేసి పితరులను తలపోసి
కాకులకు గ్రద్దలకు పెట్టు గాడ్దెలార
పియ్యి దినెడి కాకి పితరుడెట్లాయెరా ...... విశ్వ".

పిండాన్ని జేసి, పితృదేవతలను తలచుకొని కాకులకు పెట్టే ఆచారం అనాదిగా హిందూ సమాజంలో వుంది. కాకి పిండాన్ని తింటే పితృదేవత లెట్లా స్వీకరించినట్లవుతుంది. ఇది వేమన్న సంప్రదాయ వాదులను వేసిన ప్రశ్న. దీనికి ఋజులేమీ లేదు. నిర్జీవ సంప్రదాయం. దీనిని పాటించే వారు గాడిదలని తిడుతున్నాడు, తిడితేనైన బుద్ధి వస్తుందేమోనని ఆశ.

తీర్థస్నానాలు, తీర్థయాత్రలు చేయటం వలన వచ్చే పుణ్యమేమీ లేదని కచ్చితంగా చెప్పాడు వేమన. అర్థావగాహన లేకుండా వేదాలను చిలుక పలుకుల్లా వల్లించేవారిని అవహేళన చేశాడు.

"మునిగి బ్రాహ్మణుండు ముందు గానగబోయె
తిరిగి తిరిగి యతడు దిమ్మరాయె
కూసి కూసి తుదకు కుక్కయై పోయెరా......విశ్వ"

మరొకచోట "వెర్రికుక్కలవలె వేదాల్ చదివేరు" అని కసరి కొట్టాడు.

ఏకాదశి, ద్వాదశి ఇత్యాది వ్రతాలు చేస్తూ ఉపవాసాలుండే సంప్రదాయాల్ని కూడ వేమన అపహాస్యం చేశాడు,

"కూడు దినకయున్న కుక్షిలోపల వహ్ని
భక్షణంబు సేయు కుక్షి మలము
'కూడు విడవ మలము గొనియుండు నుపవాసి—విశ్వ'.

మానవులంతా ఒక్కటే. కుల, మత, భేదాలు, జాతి వైషమ్యాలు వుండకూడదని నేడు మనమంతా వేదిక లెక్కి ఉపన్యాసాలిస్తుంటాం. ఆచరణలో మాత్రం పూజ్యం ఈనాటికి మన మాస్థితికి చేరుకోలేదు. దీనికి మనలో చిత్త సంస్కారం లోపించడం, స్వప్రయోజనాభిలాష కారణం. కాని వేమనఆనాడే జాతి, మతభేదాలు లేని అభ్యుదయవాది. కులంకన్నా గుణం ఘనమని ఘోషించిన ఘనుడు వేమన.

"మాలవాని నేల మరి మరి నిందింప
నొడల రక్త మాంస మెకటి గాదె
వానిలోన మెలగు వాని కులంబేది ......విశ్వ".

అని పలికి సర్వమానవ సమానత్వానికి వినూత్న కాంతి కవాటాలను తెరచిన అభ్యుదయ కాముకుడు.

ప్రతి ఫలమాశించి, ఎవరి పంచనో జేరి పొట్టకూటికై భావ స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొని కావ్యాలు రచించి అమ్ముకొని ఘనులమని చెప్పుకొనే కవులు ఆనాడు కోకొల్లలుగా వున్నారు వారందరిని వేమన నిరసించాడు.

"తోట కూరకైన దొగ్గలాకునకైన
తవుడుకైన తాలు తప్పకైన
కావ్యములను చెప్పు గాడ్దెలు ఘనులైరి ...... విశ్వ."

ఇంతటి ప్రజాకవిని కొంత మంది కవిగా గుర్తించక పోవడం శోచనీయం. సంప్రదాయ కవిత్వాభిలాషియైనా శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారు వేమనను కవిగా గుర్తించి ఏడు ఉపన్యాస లహరులను తెలుగుదేశంపై ప్రవహింప చేశారు. అది ఆయన సహృదయతకు నిదర్శనంగా వాటి నుంచి నేటి వరకు ఎందరో వేమనను గురించి పరిశోధన చేశారు. ఇంకా ఆయన కవితకు సమగ్రమైన విమర్శ గ్రంథమేదీ రాలేదు. భవిష్యతులో వస్తుందని ఆశిద్దాం. కొందరు సంప్రదాయవాదులు వేమనను కవిగా గుర్తించకపోయినా, జాతి జనుల జీవనాడులలో వేమన కవిత్వం అమృతాత్మకంగా ప్రవహిస్తూనే వుంటుంది.

చాగంరెడ్డి నరసింహా రెడ్డి

# శ్రీ నాగభైరవ కోటేశ్వర రావుగారి "నా ఉదయం" కవితల సంపుటి సమీక్ష

హృదయ స్పందన భావుకతకు జీవ లక్షణం. అట్టి భావుకుడు కవి కూడా అయితే, తన అనుభూతిని అక్షర బద్ధం చేసి ఇతరులకు పంచి ఇవ్వగలుగుతాడు. ఆ భావావేశానికి అవరోధం రానీకుండా మాత్రాఛందస్సులో కవిత అల్లగల నేటి కవులలో శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారు ఒకరు.

"నా ఉదయం
తూర్పులోంచి కాదు
ఊర్పులోంచి - మనసు
మార్పులోంచి-మనిషి
తీర్పులోంచి పుడుతుంది —"

అని ఆ ఉదయం ఎలాంటిదో చెప్పారు. ఆ ఉదయించిన ఉదయం ఎలా నిలుస్తుందో ఇలా చెప్పుతున్నారు.

నా ఉదయం అస్తవ్యస్తంకాదు
"నా ఉదయానికి అస్తమయం లేదు
అది నిత్య నూతనం
అదిసత్య భాసితం
శాశ్వతం."

ఈయన కవితల్లో కేవలం కవిత్వం మాత్రమే కాకుండా కథా గమనికత కూడా చోటుచేసుకుంది. కథన కుతూహలం పాఠకునిలో ఉత్సుకత ఉంది. దీనితో పాఠకునిలో ఒక చక్కటి ముద్ర వేస్తారు. చెప్పదలచుకున్న విషయాన్ని చక్కగా చిన్న చిన్న మాటల్లో మనకు అందిస్తారు. నన్నయ ఉత్సవాల సందర్భంగా ఆయన చెప్పిన కవితలో నన్నయ మహనీయుడి వేడి నిట్టూర్పులు మనకు ప్రతిబింబింప చేస్తారు,

"భారతాన నువ్ చేసిన
భాషా ఛందోయతులను
మన్నించుట మానామని
మనసు నొచ్చుకున్నావా ?
ఆకలికై ఒక పీఠం
ఈ కవికై ఒక పీఠం

పితమ్ముల పేరులతో
పేరులకై ఆరాటం
స్వామీ! ఈ మధ్యలో
సాహిత్యం బలిపీఠం

స్మృతినీయది, భృతిమాయది.
కాలపుగతి కలవంటిది

ఏడ్పునీది ఊడ్పుమాది శీర్షిక 'ఈఊరికి దార్నిదే' ఈ కాలంలో వస్తున్న కవిత్వంను, కవులను, వాళ్ళ ధోరుణులను, వారు పత్రికలో ఒక రచన అచ్చుకాగానే, నలుగురు మిత్రులు ఓహో అనగానే వాళ్ళ హావభావాలు ఎలా ఉంటున్నాయో, రెండు దశాబ్దాలుగా కవితారంగంలో పరిభ్రమిస్తున్న శ్రీ నాగభైరవగారు వారిని తమకవితలో ఇలా వర్ణించారు.

"పత్రికలో కవితపడిన
ప్రతివాడూ మహాకవే
కులం గుంపు చుట్టూచేర
ప్రతివాడు వాచస్పతి" అని వ్యంగ్యధోరణిలో

ఈ యువకవి సమాజాన్ని కంపింప చేసారు.

"ప్రావృట్కాల పయోధర
గర్జప్రకోపాలు
జీవత్కావ్య శార్దూల మత్తేభ
మదోన్మత్త నృత్త ప్రలాపాలు

ఎగరేసిన అమానుష శ్రీయోషా" అని తన కవితలో సంప్రదాయబద్ధమైన పదాలలో భావాలను సృష్టించిన శ్రీనాగభైరవ కోటేశ్వరరావుగారు ప్రస్తుతం సమాజంలోని సమస్యలను, బాధలను, బాధాసర్పద్రష్టలనూ తన కవితలో మనకు అందించారు.

ప్రభుత్వపు కర్కశ విధానాలకు పదవీ విరమణ వయస్సు 55 సం॥లకు తగ్గించడంతో ఎంతో మంది హఠాత్తుగా అనాథలు అవడమే కాకుండా, కొంత మంది జీవితాలనే చాలించుకున్నారు. ఆ వెతలను ఇలా మనకు అందించారు.

"గతవత్సర హేమంతపు
ఋతుశైత్యపు గాలుల్లో
విభైఐదేళ్ళనిండి

ఏ ఆకులు రాలాయో
ఏమని చెప్పను నీకు
నిన్నటి నా మంచు కథలు
ఏమని విప్పేను నేను
గుండెలలో ముల్లు వ్యథలు"

ఈ "నా ఉదయం" కవితా సంకలనములో మొత్తం 18 కవితలుఉన్నాయి. శ్రీనాగభైరవగారు తమ కవితల్లో సామాజికతను, దార్శనికతను ప్రతిబింబింప చేసిన అభ్యుదయ కాముకుడు అని అనవచ్చును.

ఈ పుస్తకం కావలసిన వారు రచయితపేర, ప్రభుత్వ స్త్రీల కళాశాల, చీరాల 523 155 కు 6 రూ॥లు పంపించి తెప్పించుకోవచ్చును.

టి. శ్రీరంగస్వామి
ఇం. నెం. 5-11-114/4
విద్యారణ్యపురి
వరంగల్లు
506 009

\+ \+ \+ \+

# ప్రబోధ కవిత్వం

'మానవుడు మహనీయుడు' శ్రీ చెళ్ళపిళ్ళ సన్యాసిరావుగారి కవితా సంపుటి నామధేయం. వచన కవితా సంపుటి. చెళ్ళపిళ్ల సన్యాసిరావుగారు శ్రీకాకుళం జిల్లా గుళ్ళసీతారాంపురంలో జిల్లా పరిషత్ హైస్కూలులో హిందీ పండితులుగా పని చేస్తున్నారు. ఇందులోని కవితలు చాలా వరకు తెలుగు విద్యార్థి విపంచి శుభోదయ, మహోదయ మున్నగుపత్రికల్లో ప్రచురించబడినవే. 33కవితలున్నాయి. ప్రజలకు అర్థమయే రీతిలో రాసిన కవిత్వం.

మానవుడు మహనీయుడు కవితలో కృతయుగం నుంచి ఆధునిక యుగం వరకు మానవుడు సాధించిన విజయాలను కీర్తించాడు. ధనికుల పేదల వ్యత్యాసాన్ని 'జీవితంలో' అన్న కవితలో చక్కగా చూపారు. ఆశలు, సుఖాలు, భావాలు, ఆనందాలు ధనికులకు పేదలకు ఏ విధంగా మార్పు చెందుతాయో చూపారు. క్రీడల్ని శ్లాఘించారు.

ఈనాడు క్రీడలు అంతర్జాతీయ కీర్తిని ఆర్జించి పెడుతున్నాయి. క్రీడలు.

దేశౌన్నత్యానికి చైతన్య స్రవంతులు
ఆత్మ స్థైర్యానికి పకాృ ఛవంతులు
అంతరాష్ట్రీయ మైత్రికి తోడ్పడు శ్రీమంతులు
విశ్వ కల్యాణాని కుపకరించు స్వర్ణతంతులు

మమతలకథ ముగింపులో మరోలోకాన్ని దర్శించగలిగే మహత్వ పూర్ణ దశ వృద్ధాప్యం అంటున్నారు. యువ వివేకి ఎటువంటి వాడో చెపుతున్నాడు వినండి.

వలపు గీతాలను వల్లెవేయడు
వ్యామోహాలకు వారువ మవడు
విజయం వరించే వరకు విసిగిపోవడు.
వనిత నెంచు వేల వరకట్నాదు లెంచడు.

వెదురు ముక్కను మనం చూస్తూనే వుంటాం. కాని అది కవిగారికి చక్కని ప్రబోధాత్మక వస్తువుగా గోచరించింది.

తనువును చిల్లులు చేసుకుంటూ
తెలియని మంచిని తెల్సుకోవాలంటూ
తానందుకు ప్రయాణమంటూ
వంశఖండం—
వడివడిగ
వనందాటి
వేణువై
భవితవ్యాన్ని ......
గానం చేస్తున్నది.

తాను శిథిలమైనా లోకానికి పథ నిర్దేశం చేయడం గొప్ప గుణం. ఆనందాన్ని అందించినా అంతే.

ఎవడు అధ్యాపకుడో వివరించారు. కాని ఆ గుణాలు ఈనాటి అధ్యాపకుల్లో ఎంత వరకు ఉన్నాయనేది సందేహమే. విద్యాలయాలు అవినీతి నిలయాలవుతున్నాయి. విద్య డిగ్రీలతో కొలుస్తున్నారు. ప్రతిభకు తావులేదు. అధ్యాపకులకు ధన తృష్ణా పిశాచి ఆవరించింది. విద్యాస్థాయికి పొందవలసిన వికాసం ఎంతమందికి వుంటోంది? అధ్యాపకులు నిజంగా చదివి మననం చేసుకుని ఆచరించాల్సిన సూక్తులు, నవయువకా గీతం నవయువకులకు ప్రబోధ పాఠం. అధ్యాపకుడికి వుండాల్సిన లక్షణాలే కాదు విద్యార్థికి వుండాల్సిన గుణాలను అభివర్ణించారు. కట్నాల మోజులో పట్నాలు చేరవద్దని, కట్నాలు కోరవద్దని ఆ అభూత సంప్రదాయాన్ని తలెత్తనీయవద్దని హితవు చెప్తాడు పెండ్లికొడుక్కి. నీవెవడవు కావాలి అన్న కవితలో

'భారతరత్న'గా వెలసియున్న కల్పవల్లి ఇందిరమ్మయైతే
ఆంధ్రయువకా! మరినీవెవడవుకావాలి?

కవి ఇందిరమ్మను అంతగా ప్రస్తుతించడం మంచిది కాదు. ఇందిరమ్మ ఆత్యయిక పరిస్థితి దురంతాలు జాతి మరచి పోలేదు. జనతా పాలనాంతర కాలంలో ఉద్యోగులపై కక్ష సాధింపు చర్యలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించడానికి కుటిల యత్నాలు మనకు తెలియనివి కావు. 'ఒక్కటే' లో భిన్నత్వంలో ఏకత్వ దర్శనం. దేశ వర్తమాన స్థితికి ప్రతిబింబం దర్పణం ద్వంద్వాతీత దృష్టికి నిదర్శనం 'వ్యత్యాసం' సమతా మమతలతో ప్రేమామృతం పంచే ప్రేమమయుడు. 'అంజలి' ఘటిస్తూ ఆ దేవుడికి గొప్ప గుణాలను (లోకానికుపకరించేవి) ప్రసాదించమని వేడుకొంటున్నాడు.

కవి అఖిలాండాన్ని అసంఖ్య అందాల్ని స్వానుభూతిలో సాక్షాత్కరింప చేసుకున్నాడు. అందుకే భౌతికమైన అందం, ఆనందం వ్యర్థంగా కనిపించాయి. అందుకే భౌతిక గుణాలకన్నా అంతర్గుణాలకు అధిక ప్రాధాన్యం యిచ్చాడు. కవి ఉపాధ్యాయుడు గనుక ప్రతి కవిత వెనుక ఉపాధ్యాయవాణి 'మృదూనికుసుమాదపి' లాగ వినిపిస్తోంది. మంచితనం, మానవత్వం కవిత్వానికి ప్రాణ పదార్థం. ప్రకృతి కూడ మానవునికి మంచినే బోధిస్తున్నదని దృశ్య చిత్రణ ద్వారా చూపించారు. ప్రవక్త (ప్రాఫెట్)లాగ ప్రబోధించడం వలన కవిత్వం పలచబడింది. ప్రబోధాత్మక కవిత్వం ఎక్కువ. 'జీవితోద్యానం' వంటి కవితలు లేవు ఈ సంపుటిలో మంచి చేయాలన్న స్పందన అందరిలో పుట్టుకు రావాలన్న కవి చిత్తశుద్ధి మెచ్చదగింది. వారి మాటలతోనే ముగిస్తాను. వారికీ వర్తిస్తాయి ఆదర్శాలు నెలకొల్పారు గనుక.

ఎవరెన్ని పుస్తకాలు
వ్రాసేరన్నది కాదు
ఎవరే యే ఆదర్శాలు
నెలకొల్పేరన్నది కావాలి.

# వార్తావాహిని

## వాణి హిందీ విద్యాలయ సప్తమ వార్షికోత్సవము విజయనగరము

తేది. 2-2-1984 సాయంత్రం 5-00 గంటలకు వాణీ హిందీ విద్యాలయ సప్తమ వార్షికోత్సవము వైభవోపేతముగా జరిగినది. స్థానిక శాసన సభ్యులు శ్రీ పి. అశోక గజపతిరాజు గారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు శ్రీ వై. అంజనేయులుగారు వార్షిక రిపోర్టు చదివినారు. శ్రీ వై. మస్తాన్ రెడ్డి ఎమ్. ఎస్. సి. బి. ఇ. డి. జిల్లా విద్యా శాఖాధికారి గారు సభాపతిగా విచ్చేసినారు. శ్రీ డి. నరసింహారావు ఎమ్. ఏ. శ్రీ డా॥ సుబ్రహ్మణ్యం, ఎం. ఆర్. కాలేజి హిందీశాఖాధిపతులు ఉపన్యసించినారు శ్రీ పి. అశోక గజపతిరాజుగారు ప్రమాణ పత్రములను బహూకరించి నారు. రాష్ట్రగానంతో సభ జయప్రదమయినది. సాంస్కృతిక కార్యక్రమంలో మద్రాసు సంగీత ఎకాడమీ బహుమతి గ్రహీత కుమారి ఎ. సుధారాణి గారి గానం అందరిని అలరించినది.

## హిందీపరీక్షార్థుల సత్రాంతోత్సవము, పామిడి

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర, హైద్రాబాద్ వారిచే ఫిబ్రవరి 84లో జరగు హిందీ పరీక్షల పరీక్షార్థుల సత్రాంత సమావేశం ది. 9-2-84 సరస్వతి పూజ కార్యక్రమంతో జరుపబడినది.

శ్రీ సి. శ్యామాచార్‌గారు అధ్యక్షత వహించి నారు. శ్రీ ఎ. బి. ఉమాశంకర్‌గారు అతిథులకు స్వాగతం పలికినారు. ముఖ్యఅతిథులు శ్రీ విఠల్‌రావు గారు — అందరు హిందీ నభ్యసించి మన జాతి-గౌరవ మును ఇనుమడింపచేయాలని చెప్పినారు. జాతీయ గీతంతో సభముగిసినది—

## హిందీ ప్రేమీమండలి సత్రాంతసమారోహము ఈతముక్కల

తేది. 9-2-1984న ఉచిత హిందీ విద్యాలయంలో సత్రాంత సమారోహము శ్రీ డి. మోహన్‌రావుగారి అధ్యక్షతన జరిగినది. శ్రీ ఎన్. ఎన్. ప్రసాద్‌గారు హిందీప్రచార వికాసానికి తాము తోడ్పడుదుమన్నారు. శ్రీ జి. రామచంద్రరావుగారు ప్రవేశ పత్రములను బహూకరించినారు. శ్రీ సరస్వతి-శ్రీ సత్య నారాయణ స్వామివారి ప్రసాదము పంచినారు వందన సమర్పణ రాష్ట్రగీతముతో సభ దిగ్విజయమైనది.

## ప్రమాణపత్రవితరణోత్సవము- అద్దంకి

ప్రకాశం జూనియర్ కళాశాలయందు రక్తాక్షి ఉగాది (2-4-84) నాడు కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కె. శ్రీహరిగారి అధ్యక్షతన దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారిహిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము జరిగినది.

అద్దంకి కేంద్ర వ్యవస్థాపకులు శ్రీ ఆ॥ బాల కృష్ణమూర్తిగారు ఆంధ్రప్రదేశ్ భాషాపండిత సంఘం కార్యదర్శి శ్రీ వి. హనుమంతరావుగారు మరియు ప్రముఖ లాయరు శ్రీ సి. కనకసేనరావుగారలు హిందీనిగూర్చి ఉపన్యసించినారు.

శ్రీ వలపర్ల తెలుగుపండితులు కవులు శ్రీ కె. నాగ భూషణంగారు హిందీతో బాటు తెలుగులో కూడ ప్రావీణ్యం సంపాదించవలెనని ఉద్బోధించినారు. అద్దంకి తాలూకా తహసీల్‌దారుగారు శ్రీ జి. యస్. కె. గాంధీ గారు 83 అగస్టులో ఉత్తీర్ణులైన విద్యార్థి విద్యార్థినులకు ప్రమాణ పత్రములు పంచినారు. సర్వ ప్రథమ ద్వితీయ, తృతీయులుగా వచ్చిన పరీక్షార్థులకు బహుమతిప్రదానము చేశినారు. కుమారి డి. సుప్రశాంతి ధన్యవాదములు సమర్పించినది. జాతీయగీతముతో సభ ముగిసినది—

# దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర.

(పరీక్షా విభాగం)

# హిందీ ప్రచారకులకు మనవి

సం॥ 1984 ఫిబ్రవరిలో జరిగిన ప్రారంభిక పరీక్షల మార్కుల కార్డులు పరీక్షార్థుల చిరునామాలకు పంపించి వేయబడినాయి.

సం॥ 1984 అగష్టు పరీక్షలకు సంబంధించి ప్రచారకులకు కొన్ని ముఖ్య సూచనలు క్రింద పొందు పరచుచున్నాము. వానిని గమనించ వలసిందిగా ప్రచారకులకు మనవి.

## 1. అస్థాయీ కేంద్రమును స్థాపించుట :

ఉత్సాహవంతులైన యువ హిందీప్రచారకులు క్రొత్త క్రొత్త గ్రామములయందు హిందీ ప్రారంభిక పరీక్షలకు క్రొత్తగా కేంద్రములు ప్రారంభించాలని వుత్సాహపడుతుంటారు. వారికి మాస్వాగతం. అయితే దీనికి ముందు వారు కొన్నిపద్ధతులను అనుసరించాలి. అవి :- పరీక్షా కేంద్రము స్థాపించుట గురించి సభ వారికి, సభచే ముద్రించబడిన ఫారము "ప్రారంభిక పరీక్షలకు అస్థాయీకేంద్రప్రార్థనాపత్రము" నింపి పంపవలెను. అంతేగాక స్థానికముగా తాము ఏఉన్నత పాఠశాలయందు పరీక్షలు నడుపుట మంచిదని తలచి నారో ఆ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుల వారిని కేంద్రప్రధాన సంచాలకులుగా వుండుటకు అంగీకరింపచేయాలి. సభకు ఒక కార్డువ్రాసి 'అస్థాయీకేంద్రఫారము'ను తెప్పించుకొనవచ్చును. ఈ ఫారమునునింపి, అగష్టు పరీక్షలకయితే మే 15వ తేదీలోగాను, ఫిబ్రవరి పరీక్షలకయితే నవంబరు, 15వ తేదీలోగాను పంపవలెను. సభవారినుండిగాని, స్థానిక ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుని నుండి గాని ముందుగా అనుమతి పొందకుండా పరీక్షాదరఖాస్తులు, పరీక్షాశుల్కము పంపవద్దని మనవి. అట్లు పంపబడిన దరఖాస్తులు అంగీకరించబడవు. పరీక్షాశుల్కము త్రిప్పి పంపబడదు.

## 2/1. ఛూట్

నేరుగా రాష్ట్రభాష పరీక్ష ఇవ్వదలచిన హిందీ విద్యార్థులు యిందుకు సంబంధించి 'ఛూట్' నియమములను తప్పక పాటించ మనవి. నియమములు వేరొకచోట పొందుపరచ బడినవి. అట్లుగాక నేరుగా రాష్ట్రభాష పరీక్షాదరఖాస్తు పంపిననూ లేక "మధ్యమ పరీక్ష నుండి ఛూట్ కొరకు ఆవేదన పత్రం"ను రాష్ట్రభాష దరఖాస్తు పత్రముతో జతచేసి శుల్కముతోపాటు పంపిననూ అవి అంగీకరించబడవు. అట్లు పంపబడిన దరఖాస్తులు అంగీకరింపబడవు సరిగదా వానితో పంప బడిన శుల్కము త్రిప్పి పంపబడదు.

## 2/2.

ఈ విషయము నందు హిందీ విద్యార్థులకు సరియైన మార్గదర్శకత్వం వహించి పరీక్షా కార్యక్రమము సక్రమముగా నడుపుటలో సభకు సహకరించ వలసినదిగా ప్రచారకులకు మనవి.

**3/1. ప్రారంభిక దరఖాస్తులు :-**

హిందీ ప్రారంభిక దరఖాస్తు ఫారములు కేంద్ర సభ, ఆంధ్రసభ వారిచే వేరు వేరు సైజులలో ముద్రించ బడుచున్నవి. ఆంధ్రప్రాంతమందలి ముఖ్యముగా నెల్లూరు, చిత్తూరు, కడప. అనంతపురం కర్నూలు ప్రచారకులు మద్రాసు వారిచే ముద్రించ బడిన (పెద్దసైజు) ఆంధ్రసభచే ముద్రించబడిన (చిన్నసైజు) ఫారములను కలిపి పంపుచున్నారు. దీని వలన ఆంధ్రసభ వారికి ప్రవేశ పత్రములు పంపునపుడు, మార్కుల కార్డులు పంపునపుడు చాలా యిబ్బందులకు లోనుగావలసి వస్తున్నది. వేరు వేరు సైజులుగల ఫారములు నింపి పంపుట వలన ప్రవేశ పత్రములు కత్తిరించునపుడు ఒక సైజు దరఖాస్తు యొక్క ప్రవేశ పత్రంలో సగభాగం కత్తిరించబడటం, చిన్న దరఖాస్తుయొక్క ప్రవేశపత్ర పైభాగమందలి చిరునామా కాలము సగం కత్తిరించబడటం జరుగుతున్నది. ఈ కారణంగా కొన్ని ప్రవేశపత్రములకు పరీక్షా క్రమసంఖ్య లేకుండా పోవుట, కొన్ని దరఖాస్తుఫారములందు చిరునామా సగం మాత్రమే వుండుట జరుగుచున్నది. దీని కారణంగా దరఖాస్తునందలి రెండవ అడ్రసును మార్కుల కార్డునకు అంటించి దానిని పరీక్షా ఫలితములు ప్రకటించిన వెంటనే పరీక్షార్థులకు పంపాలనే ప్రధానోద్దేశ్యం నెరవేరుటలేదు. ఈ కారణంగా మార్కు కార్డులు పై చిరునామాలు వ్రాయించవలసి వస్తున్నది. దీనివలన సహజంగానే ఆలస్యం జరుగుతుంది మార్కుల కార్డులు పంపుటలో జరుగుతున్న ఆలస్యం కారణంగా ఆ తరువాత పంపవలసిన ప్రమాణ పత్రములు కూడా ఆయా కేంద్ర సంచాలకుల వద్దకు ఆలస్యంగా పంపవలసి వస్తున్నది.

**3./2.**

ఇందువలన హిందీ అభిమానుల లోను హిందీ ప్రచారకుల లోను సభవారు సరియైన సమయంలో ప్రమాణ పత్రములు పంపలేకపోతున్నారనే నిరుత్సాహం, నిస్పృహ చోటుచేసుకొంటున్నాయి.

**3./3.**

ఇందుకు ప్రచారకుల సహకారం ప్రధానపాత్ర వహిస్తుంది. అదేమిటంటే. ప్రచారకులందరూ ఆంధ్ర సభచే ప్రచురింపబడిన, చిన్న సైజు (ఫుల్ స్కేప్ : 17 × 27) దరఖాస్తులను మాత్రమే నింపించిపంపటం. ఇట్లాచేస్తే మీరు వ్రాసిన అడ్రసును చక్కగా కత్తిరించి మార్కుల కార్డుకు అంటించడానికి సులువవుతుంది. కనుక మాకు సహకరించ మనవి. కొందరు ప్రచారకులు దరఖాస్తునందలి చిరునామా కాలములు రెంటిని నింపుట లేదు. రెండు చోట్లా చిరునామాలు స్పష్టమైన అక్షరములలో వ్రాయవలసినదిగా మనవి.

ప్రచారకులు సభతో తప్పక సహకరిస్తారని ఆశిస్తూ,

హైదరాబాదు-500 004
ది. 28-4-1984

(సం) తం॥ వెం॥ సుబ్రహ్మణ్యశాస్త్రి
కార్యవాహి కార్యదర్శి

# స్వర్ణజయంతి పరిచయ పరీక్ష

## నాల్గవ పర్యాయం జరుగనున్న పరిచయ పరీక్ష వివరం

1. పరీక్షార్థుల పట్టిక, పరీక్షా రుసుము
   అంగీకరించు చివరి తేది. ది. 26-6-1984
2. పరిచయ పరీక్ష జరుగు తేది- ది. 22-7-1984

పరిచయ పరీక్ష ప్రథమపర్యాయం 82 కేంద్రాలలో, రెండవ పర్యాయం 115 కేంద్రాలలో మరియు మూడవ పర్యాముం 246 కేంద్రాలలో దిగ్విజయముగా జరిగినది. హిందీ పండితులు ఉత్సాహంగా ముందుకువచ్చి పరిచయ పరీక్షను విజయవంతం చేయుటకు పూనుకున్నారు వారికి సభ పక్షాన ధన్యవాదాలు.

నాల్గోసారి పరీక్షకు యింకా ఎక్కువమందికి హిందీనేర్పి పెద్దసంఖ్యలో పరీక్షకు కూర్చోబెట్టమని హిందీ పండితులకు మనవి చేస్తున్నాము. వివరాలకు వెంటనే మాకు వ్రాయండి.

చాలామంది హిందీ పండితులు పరిచయ పరీక్షారుసుము డ్రాఫ్టులద్వారా పంపు చున్నారు. కొంతమంది డ్రాఫ్టులమీద "కార్యదర్శి, దక్షిణభారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర" అని వ్రాయుచున్నారు. దానివలన అసౌకర్యము కలుగుచున్నది. కావున "కార్యదర్శి, స్వర్ణోత్సవ సమితి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర అని వ్రాసి పంప కోరుచున్నాము.

హైదరాబాదు. — గోదా తిరుమలయ్య
ది. 27-4-1984 — తాత్కాలిక కార్యదర్శి.
స్వర్ణోత్సవ సమితి

---

## గ మ ని క

స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితుల ఫోటోలను 1984 మే నెల సంచికలో ప్రచురించజాలనందుకు చింతిల్లుచున్నాము. వచ్చేనెల జూన్ సంచికలో ప్రచురింపబడునని తెలియజేయుచున్నాము

హైదరాబాదు. — కార్యదర్శి
ది. 27-4-1984 — స్వర్ణోత్సవ సమితి

# NOTIFICATION

## HINDI ENTRANCE EXAMINATION : JUNE, 1984.

It is hereby notified for the information of the public to the Hindi Entrance Examination for admission to Hindi Pandits Training Course, Pracharak Training Course and Shikshak Traning Course 1984-85 will be conducted by the Commissioner for Government Examinations, A. P., Hyderabad at the places, Hyderabad, Warangal, Kurnool, Nellore, Vijayawada and Rajahmundry on 30-6-1984.

QUALIFICATIONS:- A Pass either in Rastra Bhasha Praveen of Dakshina Bharata Hindi Prachara Sabha, Madras or Vidwan of Hindi Prachara Shaba, Hyderabad or any other examination recognised as equivalent to them.

EXAMINATION FEES:- Rs. 10/- should be remitted towards the examination fees on or before 21-5-1984 under the follwing head of account.

"077-Education (B) — Secondary Education
05 Tuition and other fees
01 Examination, Fees.
02 Other fees - Fees for the Hindi Entrance Examination, June, 1984."

The last date for the receipt of applications directly from the candidates, addressed to the Addl. Joint Secretary to the Commissioner for Government Examinations, A. P. Hyderabad is 24-5-1984. Two self addressed (with Pin Code) covers, one for sending hall ticket and the other for communicating the result, should be enclosed with the application form.

MODE OF EXAMINATION:- The examination consists of 2 parts. i. e. written test for 75 marks and Viva Voce Test for 25 marks. The written test will be of 2 hours and structure of question paper is as follows :-

| | | | |
|---|---|---|---|
| 1. | 2 Essay type questions on the History of Hindi Literature (15 marks) each | — | 30 Marks. |
| 2. | General Essay | — | 20 Marks. |
| 3. | Precise writing | — | 15 Marks. |
| 4. | Letter Writing | — | 10 Marks. |
| | Total | | 75 Marks. |

The written test will be conducted from 10 a. m. to 12 noon and the Viva Voce on the same day from 2 P. M. and on the next day if necessary.

APPLICATION FORMS :- The application forms may be obtained from this offic by sending a requisition letter along with a 22 x 12 cm. size self addressed stamped envolope.

The applications received after the due date will not be accepted under any circumstances.

L. GURAPPA
ADDL. JOINT SECRETART.

OFFICE OF THE COMMISSIONER FOR
GOVERNMENT EXAMINATIONS;
ANDHAR PRADESH; HYDERABAD.
DATE April 7th, 1984.

# ప్రమాణపత్ర వితరణోత్సవం

రామచంద్రాపురము

తేది 28-3-84 న బి. హెచ్. ఇ. ఎల్. హయ్యరు సెకండరీ విద్యాలయ మందు, మిస్. మాలతి గోపాల కృష్ణన్ గారి అధ్యక్షతన, ప్రమాణ పత్ర వితరణోత్సవము జరిగినది.

కార్యక్రమము వ దేమాతరం మరియు వేద మంత్రములచే ఆరంభించ బడినది. దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారి పరీక్షలయందు ఉత్తీర్ణులయిన విద్యార్థి విద్యార్థినులకు ప్రమాణ పత్రములు పంచబడినవి. శ్రీ యం. రఘుపతిగారు ధన్యవాదములు సమర్పించిరి. రాష్ట్రీయ గానముతో సభా కార్యక్రమములు జయప్రద మైనవి.

# రేడియో అన్నయ్య

అఖిలాంధ్ర బాలలోకంచేత ఆత్మీయతతో "అన్నయ్య'' అని పిలిపించుకునే శ్రీ న్యాయపతి రాఘవరావుగారు హైద్రాబాద్‌లో 24-2-84న అస్తమించినారు.

1940లో ఆంధ్ర బాలానంద సంఘాన్ని స్థాపించి తెలుగుదేశంలో బాలల ఉద్యమానికి నాంది పలికారు. తెలుగులో "బాల'' అనే పత్రిక స్థాపించి బాలల వికాసానికి తోడ్పడినారు. వారు మద్రాసు ఆల్ ఇండియా రేడియోస్టేషన్‌లో పిల్లలకు ప్రత్యేకంగా రేడియో ప్రోగ్రాములు ప్రారంభించి కడు సమర్థవంతంగా నడిపినారు. వారి అస్తమానం వల్ల బాలల లోకంలో చీకట్లు అలముకొన్నవి. ఈశ్వరుడు వారి దివంగత ఆత్మకు చిరశాంతిని ప్రసాదించమని కోరుచున్నాము.

# హిందీ-తాత

ప్రముఖ గాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధులు, హిందీ ప్రచారకులు, శ్రీ దశిక సూర్యప్రకాశరావు గారు రాజమండ్రిలో ది 26-4-84 ఏకాదశి పుణ్యఘడియలో శాశ్వతంగా కనుమూసినారు.

వారు ఎన్నోసార్లు జైలుకి వెళ్ళినారు. అక్కడ కూడా హిందీప్రచారం చేసినారు. వారు ఘనీభవించిన మానవతావాది, దేశభక్తులు, పండితులు, కర్మయోగులు, వారి ఆత్మకు శాంతి చేకూర్చమని దక్షిణ భారత హిందీ ప్రచారసభ, పరమాత్మను ప్రార్థించుచున్నది.

ఓం శాంతి శాంతి శాంతిః

दक्षिण भारत हिन्दी प्रचार सभा–आन्ध्र

# सन् 1984 अगस्त की प्रारंभिक परीक्षाएँ

## जरूरी सूचनाएँ

1. **आवेदन-पत्र मंगाने के नियम**—प्रत्येक आवेदन-पत्र का दाम 1–00 है। दस से अधिक आवेदन-पत्र एक साथ मंगाने पर प्रमाणित प्रचारकों को 20% कमीशन दिया जाएगा। हमेशा दाम डाक-खर्च सहित पोस्टल आर्डर के रूप में पेशगी में भेजना चाहिए। **M. O. के द्वारा न भेजें।**

2. **आवेदन-पत्र व शुल्क भेजने के नियम**– सभी आवेदन-पत्र एक साथ निश्चित तारीख के पहले प्रमाणित प्रचारक के द्वारा ही भेजे जाएँ। नियत तारीख के बाद प्राप्त होनेवाले आवेदन-पत्र किसी भी हालत में स्वीकार नहीं किये जायेंगे।

3. एक लिफाफे में एक ही केन्द्र के आवेदन पत्र मात्र भेजें। विभिन्न केन्द्रों के आवेदन-पत्र तथा उनके परीक्षा शुल्क अलग अलग भेजना चाहिए।

4. आवेदन-पत्रों की पहुँच जाननी हो, तो आवेदन-पत्रों के साथ अपना पता लिखा हुआ एक पोस्ट-कार्ड भेजना चाहिए।

5. परीक्षा-शुल्क के साथ और कोई शुल्क मिलाकर नहीं भेजना चाहिए।

6. परीक्षा-शुल्क एक बार जमा होने पर किसी भी हालत में नहीं लौटाया जाएगा, न अगली परीक्षा के लिए सुरक्षित ही रखा जाएगा न दूसरी मद में अड्जेस्ट किया जाएगा।

7. आवेदन-पत्रों में केन्द्रों का नाम सोच-विचारकर दर्ज करें। क्योंकि बाद को **केन्द्र परिवर्तन नहीं किया जा सकता।**

8. किसी स्थान पर अस्थायी रूप से परीक्षा-केन्द्र खोलना हो, तो उसके लिए प्रार्थना-पत्र परीक्षा की तारीख से तीन महीनों के पहले सभा में पहुँच जाना चाहिए। देर से प्राप्त होनेवाले प्रार्थना-पत्रों पर विचार नहीं किया जाएगा।

9. परीक्षा-फल के सम्बन्ध में परीक्षा विभाग का निर्णय ही अन्तिम है।

## छूट-नियम

**स्वीकृत समकक्ष हिन्दी परीक्षाएँ :—** एस. एस. एल. सी., या मेट्रिक या दसवीं कक्षा इन परीक्षाओं के हिन्दी पर्चे में कम से कम 35% अंक पानेवाले विद्यार्थियों को, उत्तर भारतीय हिन्दी या उर्दू माध्यम स्कूलों की चौथी कक्षा में उत्तीर्ण विद्यार्थियों को और केन्द्र सरकार की 'प्रबोध' तथा केन्द्रीय हिन्दी निदेशालय की "हिन्दी परिचय" में उत्तीर्ण लोगों को सभा की **'राष्ट्रभाषा' परीक्षा** में बैठने की अनुमति दी जा सकती है। भारत के किसी भी विश्वविद्यालय के स्नातक सभा की मध्यमा परीक्षा से छूट प्राप्त कर सीधे 'राष्ट्रभाषा" परीक्षा में बैठ सकते हैं। इसके लिए नियत छूट फारम, नियत छूट शुल्क रु. 10/– के साथ **परीक्षा की तारीख से तीन महीनों के पहले** सभा में पहुँच जाना चाहिए।

**छूट फारम का दाम रु. 1.00 है।** दाम व अपना पता लिखा हुआ और स्टैंप लगा हुआ लिफाफा पुस्तक विभाग में भेजकर मंगा सकते हैं। दाम इण्डियन पोस्टल ऑर्डर के द्वारा ही भेजें।

### सन् 1984 अगस्त की प्रारंभिक परीक्षाएँ

| | |
|---|---|
| आवेदन-पत्र स्वीकार करने की अंतिम तारीख | 15–6–1984 |
| *विलंब-शुल्क के साथ स्वीकार करने की अंतिम तारीख | 25–6–1984 |
| परीक्षाओं की तारीख | 12–8–1984 |

### परीक्षा शुल्क :

| | |
|---|---|
| प्राथमिक : | 5–00 |
| मध्यमा : | 10–00 |
| राष्ट्रभाषा: | 12–00 |

अंक सूची शुल्क रु. 1–00 : विलम्ब शुल्क रु. 1–00

परीक्षा शुल्क के साथ अंक सूची शुल्क भी मिलाकर भेजना अनिवार्य है।

**तं. वें. सुब्रह्मण्य शास्त्री**
ता. 30-4-84 कार्यवाही सचिव

Edited, Printed and Published by V. Radhakrishna Murty. on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.